# కమ్యూనిస్టు ప్యాక్టరీ అంటే

(నాటకం)



Presented by V. Krishna reddy
to Nati reddu

రచన:

సత్యనారాయణ గంగు



వాస్తవ ప్రచురణ.

Telaprolu

Presented by V. [illegible] Madras University

# పాత్రలు

| | | | |
|---|---|---|---|
| నిత్యబాబూ :- | కమ్యూనిస్టు సభ్యుడు. | వయసు | 18 |
| సత్యవాణి : | కమ్యూనిస్టుపార్టీ సభ్యురాలే | ,, | 16 |
| సీతారామయ్య :- | నిత్యబాబు తండ్రి | ,, | 45 |
| రాజారావు :- | జిల్లా కమ్యూనిస్టుపార్టీ ఆర్గనైజర్ | ,, | 35 |
| సుబ్బారావు :- | తాలూకా పార్టీ ఆర్గనైజరు | ,, | 38 |
| సుశీల :- | సుబ్బారావుగారి భార్య మహిళానాయకురాలు | ,, | 30 |
| గంగా-గోపాలారావులు:- | పార్టీసభ్యులు కుర్రాళ్ళు. | | |
| జనార్దనరావు:- | ఉద్యోగస్థుడు. | | |
| లలిత :- | జనార్దనరావు భార్య. | | |

(ఇంకా ఇతరులు సమయానుకూలంగా వస్తుంటారు.)

# అంకితం

వాస్తవాన్ని నిర్భయంగా చాటగలవాళ్ళకు
వాస్తవాన్ని నమ్మగల వాళ్ళకు
వాస్తవాన్ని ఒప్పుకోగలవాళ్ళకు
ఒక్క తిండిలోనే తృప్తిపడక
తిండి సగమున్నాచాలు స్వేచ్ఛమాత్రం
పూర్తిగాకావాలనే వాళ్ళకు.

5 TPLB101B303

# మొదటి రంగం

(నిత్యబాబు - 16 ఏండ్లవాడు. తన గదిలో టేబిల్ ముందు కుర్చీలో కూర్చుని దీర్ఘంగా పుస్తకంలో తలపెట్టి చదువుతూవుంటాడు. టేబిల్ పైన - మార్క్స్, లెనిన్, స్టాలిన్, జోషీలు వ్రాసిన గ్రంథాలువుంటాయి. గది అంతా కమ్యూనిస్టు నాయకుల పటాలతో జండాలతో అలంకరించి వుంటుంది. నిత్యబాబు కాగితాలు తిరగవేస్తూవుంటాడు. మధ్యమధ్య సిగిరేట్ కాలుస్తూవుంటాడు. కాసేపు కుర్చీలో వెల్లకిలా పడుకుని రాగాలుతీస్తూ వుంటాడు.)

పాట.

ఎర్రపతాకా - మా ముద్దుపతాకా
శత్రులగుండెకు - తుపాకిగుండై
మిత్రులగుండెకు - కవచంబై నిలచే। ఎర్ర॥
ఎగరేస్తాం ప్రపంచమంతా - ఎర్రపతాకా
స్థాపిస్తాం ప్రజాస్వామికం - భూమంతా
సాధిస్తాం సామ్యవాద - జగత్తులో
శాంతీ, సుఖమూ, స్వేచ్ఛా.
అందిస్తాం అందరికీ - ఆవాదజగత్తులో॥ ఎర్ర॥

(నిత్యబాబూ తండ్రి సీతారామయ్యగారు ప్రవేశం— ప్రవేశిస్తూనే నిత్యబాబుతో.)

సీతారా:- నీ ప్రవర్తన దిన దినం మితిమీరి పోతూవుంది. చదువట్లా నాశనంచేశావు- ఉద్యోగమూ చేయనన్నావు నిండా 16 ఏండ్లన్నా లేవు మమ్మల్నందర్నీ ధిక్కరించి ఈ పాడు పార్టీలో చేరి చెడతిరుగుతున్నావు, 13 వ ఏటే నీకీ పార్టీ జబ్బు పుట్టింది అప్పటినుంచి ఇప్పటికి పదహారేళ్లు వచ్చినా, ఒకదైవంలేకుండా ఒక గురువు లేకుండా- ఒక పెండ్లిలేకుండా చెడిపోయి తిరుగుతున్నావు. హాయ్యయ్యో ఈ పాడు కమ్యూనిస్టు పార్టీనీ మానుకుంటే బంగారంగా మొన్న వచ్చిన సంబంధాన్ని చేసుకుంటే 5 వేలు వచ్చేవే, అయిదువేలు కట్నమిస్తామన్నారే - కట్నాలక్కర్లేదట మొనగాడికి- తనిష్టమొచ్చినట్టు చేసుకుంటాడట మొనగాడు.

నిత్య:- (లేచి బాగా వుద్రేకంతో) నాన్నా, నీకెన్నో సార్లు చెప్పాను, నేచేసుకోనూ, చేసుకోనూ- చేసుకోనూ అని.

సీతారా:- నీవు చేసుకోకపోతే పొయ్యావ్ కాని దాని పెండ్లి ఎందుకు చెడగొట్టావ్.

నిత్య:- ఎందుకా మనకున్న డబ్బు చాలదూ?

సీతా:- ఆ చాలుతుంది, ఇంకో అయిదేళ్ళ తరువాత మీ అయిదుగురు అన్నదమ్ములూ పంచుకుంటే తలా ఒక కానీ రాదు.

నిత్య:- అయితే డబ్బుకోసం ఎవడో కురూపి వెధవని తీసుకొచ్చి దాని కంటకడతావా వీల్లేదు. అలా నా చెల్లెలి

పెండ్లి జరగడానికి వీల్లేదు. దాని కిష్టమైనవాణ్ణి అదే చేసుకుంటుంది.

సీతారా:- ఇష్టాలూ గిష్టాలూ కుదరవ్. మనం బ్రాహ్మలం. నీవు మాలవాడి కూడు తింటున్నావని మే మందరం తింటామూ - దాన్ని ఏమాలవాడో చేసుకుంటే వూరుకుం టామా వీల్లేదు. ఆచారం ప్రకారం హిందూమత సాంప్ర దాయం ప్రకారం-

నిత్య:- మతమూ - సాంప్రదాయం, హిందూమతం, అందు లో మన బ్రాహ్మణత్వం స్త్రీల పాలిట మృత్యుదేవత, వాళ్ళ స్వేచ్ఛను అరికట్టి - వాళ్ళు వలవల ఏడుస్తుంటే.

సీతారా:- నీ కమ్యూనిస్టుపార్టీ వుద్ధరిస్తుందిలేవోయి స్త్రీలను.

నిత్య:- తప్పక. స్త్రీల స్వేచ్ఛకేకాదు ప్రపంచ మానవస్వేచ్ఛకే పోరాడుతుంది. మానవజాతిని బానిసత్వంలో దరిద్రంలో ముంచి అమాయక మానవకోటి రక్తం జలగల్లా తాగు తూ మత్తెక్కి ప్రభుత్వాలుచేస్తున్న, సామ్రాజ్యవాదుల, పెట్టుబడిదార్ల గోరీలు తప్పక కడుతుంది. కమ్యూనిస్టుపార్టీ దారిద్ర్యాన్ని బానిసత్వాన్ని నిర్మూలిస్తుంది. స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల నిర్మాణంచేస్తుంది. దానికోసం పోరాడు తుంది.

సీతారా:- పోరాడ్తావు, కాల్చి పారేస్తారు పోలీసులు.

నిత్య:- భయంలేదు. ఆనందంగా చచ్చిపోతాను, ప్రజలకోసం.

సీతారా:- (నెత్తిన చేతులు పెట్టుకొని ఒణుకుతున్న గొంతుతో) ఎంత ముద్దుగా పెంచాను ఎంత వృద్ధిలోకి వస్తాడనుకున్నాను. ఎంత డబ్బు ఖర్చు పెడుతున్నా నాకు కష్టంగా వుండేదికాదు. చివరికి ఇట్లా అయ్యాడు. పాడు పార్టీలో చేరి హోటలుకొచ్చినట్లు అన్నానికి యింటికిరావడం తినడం పోవడం.

నిత్య:- నాన్నా నీ కంత కష్టంగావుంటే, ఇంటికి రావడం కూడా మానేస్తాను. కాని పార్టీని అనబోకు కమ్యూనిస్టు పార్టీ అంటే మామూలు తమాషా పార్టీకాదు. మహామహు లైన మార్క్సు, లెనిన్, స్టాలిన్, జోషిలపార్టీ-ప్రపంచ ప్రజలపార్టీ—

సీతా:- మరిలేకపోతే లక్షణంగా ఇల్లుండగా వూళ్లో అద్దెపెట్టి ఈ గది ఎందుకురా నీకు.

నిత్య:- ప్రశాంతత కోసం.

సత్యవాణి:- (15 ఏండ్ల పిల్ల-పార్టీసభ్యురాలు, పరుగెత్తుకుంటూ వచ్చి) నిత్యబాబుగారూ, నిత్యబాబుగారూ పృద్వీసింగు కథ నిన్నసగంలో ఆపేశారు అదిచెప్పరూ-భలే బాగుంది.

సీతా:- (కోపంగా) ఊం (అని నిట్టూర్చి) ఇంకేం ఇందుకే పిడీ అద్దె గదులల్లో చేరింది-ఛీదుర్మార్గుడా నీముఖం చూడ కూడదు—

(అంటూ చెరచెరా వెళ్ళిపోతాడు.)

నిత్యబాబు:- (సత్యవాణితో) సత్యవాణీ కూర్చో, ఆమంచం మీద ఆపుస్తకం చదువుతూ-ఇప్పుడే వస్తాను దొడ్లోకి.- పోయి (లోపలికి పోతాడు)

(సత్యవాణి మంచంమీద కూర్చుని పుస్తకం చదువు కుంటూ వుంటుంది.)

రాజారావు:- (ప్రవేశం. జిల్లా కమ్యూనిస్టుపార్టీ ఆర్గనైజర్-డే చేతిలో లెదర్ బ్యాగు, కళ్ళకుజోడు) సత్యవాణీ నువ్వొకజరు. వున్నావు. గుడ్.

సత్యవాణి:- (లేచి) ఓ రాజారావుగారా రాండి కూర్చోండి. బెజవాడనుంచేనా.

రాజా:- (కూర్చొని)-ఆఁ బెజవాడనుంచే నిత్య బాబున్నాడా-

సత్య:- ఆఁ వున్నారండి - ఇప్పుడే లోపలికెళ్ళారు. (లోపలికి చూస్తూ-)

నిత్యబాబుగారు, జిల్లా కమ్యూనిస్టుపార్టీ ఆర్గనైజరు రాజారావుగారొచ్చారు.

నిత్య:- (లోపల్నుంచే) వస్తున్నా-(వచ్చి) రాజారావుగారా, ఇదేనా రావడం.

రాజా:- తాలూకా పార్టీ ఆర్గనైజరు సుబ్బారావుగారెక్కడ.

నిత్య:- వూళ్ళోనే వున్నారండి.

రాజ:- ఆయన భార్య సుశీలగారుకూడా తాలూకా మహిళా సంఘాభివృద్ధికి బాగా కృషి చేస్తున్నదనుకుంటా.

ఆఁ తరువాత సత్యవాణి ఎట్లావుంది నిత్యబాబు.

నిత్య:- అదుగో చూడండి కనపడుతూనే వుందిగా.

రాజ:- అదికాదోయి పార్టీ ప్రచారం ఎట్లా చేస్తున్నదని-

నిత్య:- దానికేమండి బ్రహ్మాండంగా చేస్తున్నది. చక్కటి బుర్రకథలూ, నృత్యాలుచేస్తూ ప్రజలలో పార్టీ ప్రచారం బాగా చేస్తున్నది.

రాజ:- ఇక లాభంలేదోయి నిత్యబాబూ మీ యిద్దరికీ పెండ్లి చేసెయ్యాలి.

నిత్య:- ఏం

రాజ:-ఏమేమిటోయి సత్యవాణీ - నిత్యబాబూ ఒకరిమెళ్ళో ఒకరు పూలదండలు వేసుకుంటుంటే చూడాలనివుంది. నాకే కాదు పార్టీవాళ్ళంతా అదే అంటున్నారు. సత్యవాణి తలిదండ్రులుకూడా అదే అన్నారు. కదూ సత్యవాణి ఏమంటావు.

సత్య:- (ముసి ముసి నవ్వులు నవ్వుతుంది).

రాజా:- ఇంకో సంవత్సరం ఆగుతామంటారా, సరే ఆగండి. ఇంకా చిన్న పిల్లలేగా మీరు.

(తెర)

# రెండవ రంగం

(నిత్యబాబు - తనగదిలో మొదటి రంగంలో లాగే దీర్ఘంగా పుస్తకాలలో మునిగిపోయి వుంటాడు. కాని మార్పు. ఇప్పుడు టేబిల్‌మీద రెండు వైపులా రెండు రకాల పుస్తకాలుంటాయి.)

తెరవెనుకనుంచి ఒక కంఠస్వరం:-

నిత్యబాబు గత మూడు నాలుగు సంవత్సరాలబట్టీ పార్టీయే తనుగా, తనే పార్టీగా పనిచేసాడు. కాని ఇప్పుడు నిత్యబాబు పూర్తిగా మారిపోయ్యాడని చెప్పొచ్చు. ఒక ఏడాదిగా మార్క్స్, లెనిన్, స్టాలిన్ల గ్రంథాలతోపాటు ఒక కొత్త గ్రంథాలుకూడా చదవడం మొదలు పెట్టాడు. చదవడమే కాదు వాటి ప్రచారం కూడా మొదలు పెట్టాడు. ఆపుస్తకాలు అనేకరకాల, అనేకకవులకు సంబంధించినవి. షెల్లీ, బైరన్, మొపాసా, ఫ్రాయిడ్,-షా, ఉమర్ ఖయ్యాం, ఎల్లిస్, చలం, వగైరా వగైరా. ఇంకా ఎన్నో ఉత్తర వేదాంత గ్రంథాలు కూడా. సెయింట్ ఫ్రాన్సిస్, మనదేశంలో వేమన ఇట్లానే ఇంకా. కానీ ఈ గ్రంథాలు చదవడం పార్టీవాళ్ళకిష్టంలేదు, అవన్నీ అరాచకపు ప్రేమ పుస్తకాలని, వేదాంతాలని భౌతిక వాదులైన కమ్యూనిస్టులు అవి చదవకూడదని నిత్యబాబును పార్టీనాయకులు హెచ్చరించారు. ఆకలి కథల కవిత్వమే ప్రజాసాహిత్యమని, అదే అభ్యుదయ కవిత్వమని, అదే కమ్యూనిస్టులమైన మనకు అవసరమని, అదే అనుస

రించాలని నిత్యబాబుకు చెప్పారు. అవిచదవద్దన్నారు. కాని నిత్యబాబువిసిపించుకోవడంలేదు. అవేమీ తప్పుకాదని అవి చాలా ఉత్తమ గ్రంథాలని, తనస్వేచ్ఛ నడ్డటానికి వీల్లేదని విపరీతంగా వాదిస్తున్నాడు. ఆకలిబాధ తీరాల్సిందే ప్రేమ బాధ తీరాల్సిందే నంటాడు. పార్టీ అంటే ఒక విధమైన అసంతృప్తి కూడా రేగింది పూర్వం తనకు పార్టీ వ్యతిరేకుల్లోనే తప్పులు కనపడేవి. ఇప్పుడు పార్టీ మనుష్యుల్లో కూడా ఏవో మోసపు చిహ్నాలు కనపడుతున్నాయి. పార్టీనుంచి ఎప్పుడు బయటకుపోదామా అని నిత్యబాబూ, ఎప్పుడు వెళ్ళగొడదామా అని పార్టీ చూస్తోంది.

(తెర వెనుక ధ్వని ఆగుతుంది. నిత్యబాబు కుర్చీలోంచి లేచి)

ఓకీట్సు, ఓషెల్లీ, ఓహాోచలం, ఏమి వ్రాతలయ్యా మీవి, మనుష్యుల్ని కదిలించే రచనలు, కవ్వించి ప్రేమలో ముంచెత్తే కథలు, స్త్రీ, పురుష ప్రేమకు పరిమితిలేని స్వేచ్ఛ ప్రసాదించారు. మీరచనల్లో ఎక్కడా కట్టుదిట్టాలు: కఠోర మైన, ఆచరణ కసాధ్యమైన నీతులూ లేవు—

ఓ ఉమర్ ఖయ్యాం, నీసిద్ధాంతం ఎంత బాగుందోయి—

ఒక చక్కటి స్త్రీ—

ఒక పాత్ర పానీయం—

ఒక చెట్టుక్రింద ఓహో అంతకన్నా ప్రపంచంలో కోరు కోతగిందేముంది ఓహో పెద్ద మనిష్యుల కపట వేషాలు ఎంత

చక్కగా బహిరంగ పరుస్తావోయీ ఓహాపిన్నిస్ మనుష్యుల్ని ప్రేమించడమంటే ఏంటో, సేవించడమంటే ఏంటో నీకే తెలుసు, దూరంగావుండి శేవచేయలేదు- దూరంగా ఉండి దానంచెయలేదు నీవు. సర్వసంపదలు వున్నప్పటికి బుద్ధిడిలా సర్వసంగ పరిత్యాగివై జనసేవచేశావు. ఆఖరికి కుష్టురోగులకు సైతం దగ్గరకు పోయి తాకి పరిచర్యలు చేసావు.

అది సేవంటే - అది ప్రేమంటే - నీ శిష్యులుగా చేరాలంటే ఆస్థినేకాదు. విజ్ఞానాన్ని కూడ వదిలేసి వక్తిమూర్ఖుడుగా మారి చేరాలన్నావు నిజమే నీసిద్ధాంతం చాలామంచిది. విజ్ఞానం ఎక్కువౌడంవల్లె ఇన్ని అనర్థకాలువచ్చిపడుతున్నాయి. చదువు లెక్కువ కావాలంటున్నారు. ఎక్కువౌతే దేశం బాగు పడుతుందట. అంటున్నారు యిప్పటివాళ్ళు. కాని అబద్దం ఈ చదువులు మానవునికి అహంకారానిస్తున్నాయి హృదయాల్ని రాళ్ళగా చేస్తున్నాయి. అనవసరం. ఈ చదువులు-ఈవిజ్ఞానం హృదయంలేనప్పుడు ఏమిటంటే ఏం లాభం. ఇట్లాంటి గొప్ప వాళ్ళ భావాలను చెత్త అంటున్నారు కమ్యూనిస్టులు విమర్శిస్తున్నారు. నేను ఒప్పుకోను ఈ విమర్శనలు.

(పోయి మంచంమీద పడుకుంటాడు)

(సొమ్మసిలి నిద్రపోతాడు. 10 నిమిషాల అనంతరం)

సత్యవాణి:-(ప్రవేశించి) మంచందగ్గరకుపోయి నిత్యబాబూ భుజం పట్టుకుని వూపుతూ-) నిత్యబాబుగారూ ఏయి-నిత్యబాబు

గారూ-అబ్బ లేవరేం- (తన ముఖం బాదుకుంటూ) అబ్బ ఇదేం మొండినిద్ర - నిత్యబాబుగారూ లేవండి-

నిత్య:- (లేచి) నువ్వా, సత్యవాణీ, దా కూర్చో (చెయ్యి పట్టుకు లాగి తన ప్రక్కన కూర్చోపెట్టుకుంటాడు).

సత్య:- ఎంతసేపటినుంచి లేపుతున్నా లేవరేం.

నిత్య:- ఏమిటో సత్యవాణీ - పడుకోగానే హాయిగా నిద్ర పట్టింది క్షణంలో. మనసంతా పాడైపోయివుంటే పడు కున్నా. చక్కటి కల గన్నాను.

సత్య:- కల అంత బాగుందా అండి.

నిత్య:- అవును సత్యా, కలలే బాగుంటున్నాయి యిప్పుడు. కలల్లోనే మంచి మనుషులు కనపడుతున్నారు. హృదయ మిచ్చి మాట్లాడుతున్నారు. మేల్కొన్నప్పుడో - అంతా కటికివాళ్ళు, హృదయం లేనివాళ్ళు, తుక్కుమనుషులు, కుళ్లు మనుషులు, హృదయంలేని జ్ఞానులు ప్రత్యక్షమవు తున్నారు. వాళ్ళతో మాట్లాడి, పోట్లాడి నా హృదయం పాడైపోతూవుంది. అందుకే ఇప్పుడు ఎక్కువగా నిద్రనే కోరుకుంటున్నాను. నిద్రలో వచ్చే మనుషులతో ఆడు కోడానికి పాడుకోడానికి-

(ఒక క్షణమెడమిచ్చి ఒక్క నిట్టూర్పు విడిచి)

దేశానికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలూ, కూడూ, గుడ్డా, తీసుకురాగల దొక్క కమ్యూనిస్టుపార్టీయే అనుకున్నాం. దేశా

లను స్వాతంత్ర్యాలు తీసుకురావడమే మోగాని, ముందసలది, మనకే మన పార్టీలో కరువైపోయింది. ఇక దేశానికి, ప్రపంచపు కోటాను కోట్ల జనాభాకు, ఏం స్వేచ్ఛ ప్రసాదిస్తుందో అర్థం కాకుండావుంది. నమ్మటంకూడా కష్టంగానేవుంది.

సత్యా:- నిజమే నాకూ అలాగేవుంది, పాడుపార్టీపాడైపోయింది. "స్వేచ్ఛ, స్వేచ్ఛ" అని అరవడమేకాని ఆచరణలోచూస్తే శూన్యం. మరే మొన్న మీరిచ్చిన మైథానం చదువుతూ వుంటే తాలూకా పార్టీ ఆర్గనైజరు సుబ్బారావుగారొచ్చి పుస్తకమంతా చించేసి పైగా ఆడపిల్ల అనేదికూడా లేకుండా నానా మాటలూ అన్నాడు. (కంట తడిపెట్టుకుంటుంది)

నిత్యా:- (అమాంతం లేచి) నిన్నా, మాటలా:-పుస్తకం చించడమా వెళ్ళి ఇప్పుడే కనుక్కుంటాను. ఏంతెలుసు ఆయనకు అసలెవరాయన చించడానికి, నిన్ను మాటలనడానికి.

సత్యా:- లేచి (నిత్యాబాబు చెయ్యిపట్టుకొని) వూరొకండి పోట్లాటలలో వాదనలలో అసలే మీ మనసంతా పాడైపోయివుంది పడుకోండి.

నిత్యా:- పాడవనీ-విచారంలేదు-

(వుధృతమైన కంఠంతో) మనస్వేచ్ఛను అడ్డుకోడానికెవరికీ అధికారంలేదు ప్రపంచంలో. కమ్యూనిస్టు సాహిత్యమొకటే సాహిత్యమా-ఇంకెవరిదీ కాదా-ఒప్పుకోను-

సత్యా:- నాకోసం వూరుక్కుంటారా, వూరుకోరా-కూర్చోండి-అబ్బ కూర్చోమంటుంటే.

నిత్యా:- (కూర్చుంటాడు, కూర్చోని.) ఆ టేబిల్ మీద సిగరెట్ పెట్టా, అగ్గిపెట్టా ఇట్లాపడేయి.

సత్యా:- మళ్ళ యిందులో సిగిరెట్లు - గుండెంతా ఎందుకు పోయేటట్లు.

నిత్యా:- పోతే పోయిందిలే, నన్ను చంపక ముందిట్లా పడెయి.

సత్యా:- (తీసుకొచ్చి యిస్తుంది.)

నిత్యా:- (కాలుస్తూ దగ్గుతుంటాడు.)

సత్యా:- పోనీ మానుకోరాదు. ఆపుస్తకాలు చదవడం ప్రచారం చేయడం చెడ్డవని నానాగోలా చేస్తున్నారుగా పార్టీవాళ్లు.

నిత్యా:- ఏం పార్టీవాళ్ళు దేముళ్ళా మానమంటే మానడానికి, మానను- ఇంకా చదువుతాను ప్రచారం చేస్తాను. ఇక్కడేకాదు-లోకమంతా-నాగొంతు పోయేదాకా (ఈ పైమాటలు పెద్దకంఠంతో అరుస్తాడు. అరచి పెద్దదగ్గు దగ్గి గుండె పట్టుకుంటాడు.)

సత్యా:- (నిత్యంబాబు రొమ్ముమీద చెయ్యిపెట్టి) మానక పోతే పార్టీనుంచి మిమ్మల్ని-

నిత్యా:- వెళ్ళగొడతారా? - వాళ్ళేంటి వెళ్ళగొట్టేది నేనే వెళ్తాను.

సత్యా:- ఆఁ—(భయంగా)

నిత్యా:- ఏమిటట్లా భయపడతావ్—పిసుగుపడ్డట్లు.

సత్యా:- మీరు వెళితే-నేనో—?

నిత్యా:- నువ్వా—నీ సంగతి నన్నడిగితే—

సత్యా:- మిమ్మల్ని కాదా అడిగేదినుకి-మిమ్మల్ని పెండ్లిచేసుకోబోయేపిల్ల. మిమ్మల్ని అడక్క ఎవర్ని అడుగుతుంది.?

నిత్యా:- పెండ్లా—! మనకా! మనకూ! నర్తిది. (మెల్లిగానవ్వి) అసలైనా పెళ్ళేమిటి అది మన సిద్ధాంతానికే అప్రదిష్ట.

సత్యా:- పోనీ అదే మీతో వుండటానికి.

నిత్యా:- అదైనా నర్తిదే.

సత్యా:- (ఒణుకుతూ) అదేమిటి నర్తిదేమిటి నిజం.

నిత్యా:- కాదబద్ధం.

సత్యా:- (మరీ ఆగాటంగా, ఆవేశంతో) అబద్ధం ఎందుకని, నేను మీతో వుండటానికి - నీ - భార్య అదే పొరపాటు-నలుగురిలో మీదాన్నే అనిపించుకోడానికి తగనా, అర్హత లేదంటారా, లేకపోతే అందం తక్కువైందంటారా పోనీ ఏం తక్కువైందో చెప్పండి మీ ప్రక్కనే పడుకునేఅర్హతే నాకు లేకపోతే, మీ ప్రేమనుపొందే భాగ్యమే నాకు లేకపోతే, మీ పాదాల్ని నాకళ్ళతో, నాపెదాలతో తడుపుకుని జీవిస్తూ ఆనందంతోవుండే అవకాశమేలేకపోతే ఈ లోకంనుంచే తప్పుకుంటాను, చచ్చిపోతాను. (శాపునుమని కాళ్ళమీదపడి ఏడుస్తూవుంటుంది.)

నిత్య:- ఏడవకు-లే తప్పు (లేపుతాడు తనమీదకువాలిపోతుంది సత్యావాణి వెక్కి-క్కి-ఏడుస్తూవుంటుంది తన చేతో సత్య కళ్ళనీళ్ళు తుడుస్తూ) అందం లేదనికాదు చాలా గొప్ప అందం నీముఖంలో వుబుకుతూవుంది. అర్హత లేదనికాదు.. అన్నివిధాల నాపక్కన, నాతో వుండటానికి నీ కర్హత వుందికాని___

సత్య:- కాని ఏమిటి త్వరగా చెప్పండి. భోగంజాతిదాన్ని అనా వేశ్యకులంలో పుట్టిన నీచపుదాన్ని అనా - ఏం చెయ్యమంటారు నా ఖర్మగాబట్టి నాకు తల్లి భోగందిగా ఏర్పడింది. చెప్పండి అదే మీసందేహమైతే మీకు నీచత్వమేర్పడుతుందనుకుంటే మీకునీచత్వమొచ్చేపని నేనెప్పుడు కోరను. మీరన్నివిధాలా గౌరవంగా వుండటమేనాకు కావాల్సింది. చెప్పండి, త్వరగా చెప్పండి. అదే మీ సందేహమైతే - పోతాను - ఈలోకం విడచేపోతాను. మళ్ళీ కనపడకుండా చచ్చిపోతాను. (బావురుమని మళ్ళీ ఏడుస్తుంది)

నిత్య.- చాలా పొరపాటుగా అభిప్రాయ పడ్డావు. కులంవారీగా గౌరవాలు అర్హతలు లెక్క-గట్టడానికి నేనంత నీచుణ్ణికాదు నీకులంవల్ల నీమీది గౌరవం, ప్రేమ, అంగుళం కూడా తగ్గలేదు. నీవంటే చాలా గొప్ప అభిప్రాయముంది నాకు.

సత్య:- చాలు-(నిత్యచేతుల్ని కళ్ళకద్దుకుంటుంది) మరి అలాటప్పుడు ఇంకా ఏమిటి-పోనీ మీరు బ్రాహ్మలనా-అదేమన్నా ఆటంక మొస్తుందనా-

నిత్య:- మళ్ళీ పొరపాటు పడుతున్నావు. కమ్యూనిష్టు పార్టీలో ఏ నాడైతే చేరామో ఆనాడే నీబోగమత్వం, నాబ్రాహ్మణత్వం రెండూ మంటల్లో కలిసాయి. మనజాతి, మనకుల మిప్పుడు కమ్యూనిస్టుజాతి, నిన్ను చేసుకుంటే మా బ్రాహ్మణకులం వెలివేసేదేమీ లేదుకాని-ఇప్పుడు కొద్దిరోజుల్లో మన కమ్యూనిస్టుకులం మాత్రం నన్ను వెలివేయవచ్చు. అందుకేకదూ మొన్న జిల్లా యూత్ లీగ్ శకట్రిటరీకిచ్చి నిన్ను పెండ్లిచేయాలని పార్టీ నిర్ణయించింది. మీవాళ్ళంతా కూడా ఒప్పుకుంది. నీవుకూడా మౌనం దాల్చింది. నాకు తెలియదనుకున్నావా-అంతా తెలుసు పైగా ఇంతజరిగింతరువాతకూడా నాదగ్గరకొచ్చి పెళ్ళని, ప్రేమని అంటున్నావా-ఎంత విచిత్రం-!!!

సత్య:- కాదు. అంతా వట్టిది. నన్ను బలవంతం చేశారు. నాకక్కర్లేదతను. అతన్ని చూస్తే నాకు తేళ్ళుపాకినట్లుంటుంది.

నిత్య:- మరెందుకు చెప్పలేక పొయ్యావు. యిష్టం లేనప్పుడు చేసుకోనని చెప్పలేక పొయ్యావా సత్య బాబుతోనే వుంటానని.

సత్య:- ఏం చెయ్యమంటావు. వాళ్ళందర్నీ కాదనే ధైర్యంలేక మౌనం దాల్చా, మా అమ్మా, నాన్నా కూడా పార్టీ వాళ్ళతో చేరిపోయి బలవంతం చేశారు.

నిత్య:- (గట్టిగా) అమ్మానాన్నకోసం పార్టీకోసం వాడినెవడినో ఇష్టంలేని వెధవను చేసుకుంటానన్నావన్నమాట

ఇష్టంలేని వాడితో ఏమసుఖపడ్డామని - నిత్యబాబుతోనే వుంటాననే ధైర్యంలేకపోయిందే-ఛీ - అంత ధైర్యంలేని దానవు ఇంత పిరికిదానవు - నాకుమాత్రమెందుకు - వాడినేచేసుకో - ఫో - ఎంతో ధైర్యం కలదానివను కున్నాను. ఎంతో ప్రేమించాను. నాకు సాటి నీవే నను కున్నాను. చివరికి మంటల్లో గలిపావు. ఇకపో ఇక్కణ్ణించి పో...(దూరంగా నడతాడు)

సత్య:- (మళ్లీ నిత్య దగ్గరకు పోయి) తోసియకండి దూరంగా నెట్టకండి ధైర్యముంది నాకు ప్రతిక్షణం మీదాన్నే నేను మీరులేకుండా నాకు బ్రతుకేలేదు. ఎదిరిస్తాను. తల్లి దండ్రుల్నేకాదు పార్టీనేగాదు ప్రపంచాన్నే ఎదిరిస్తాను మీకోసం, ఆధైర్యముంది నాకు, ఆ శక్తివుంది నాకు వెళ్తాను. ఇప్పుడేపోయి నిత్యబాబుగారిన్ని తప్పయింకెవర్నీ చేసుకోనని - అదె పొరపాటు. ఎవరితో నూపుండనని ఖచ్చితంగా చేప్పేస్తాను. వీల్లేదంటే ఎదిరిస్తాను.పోరాడ్తాను. పోరాటంలో విజయం నాకే వచ్చేటటుగా ఆశీర్వదించండి (నిత్యబాబుదగ్గరకువెళ్ళి నుంచుంటుంది)

నిత్య:- ధైర్యమూ-పట్టుదలావుంటే తప్పక విజయంనీదే-అసలు విషయం అదికూడా కాదు. మనం నమ్మిన దానికి మనస్సు విషయంలో ఎవరన్నా అడ్డుతగిలినప్పుడు. మన ధర్మం మన సర్వశక్తితో ఎదిరించడం. అలా ఎదిరించి ఓడపోయినప్పటికి సంతోషమే. (సత్యవాణి చేతిని ముద్దు పెట్టుకుని) వెళ్ళిరా. (సత్యవాణి వెళ్ళిపోతుంది. నిత్యబాబు

మంచంమీద కూర్చుని సిగరెట్ వెలిగిస్తాడు. చివాటుగా కొంతసేపటి తరువాత-ఒక పార్టీ సభ్యుడు రంగారావు ప్రవేశిస్తాడు. చేతిలో పుస్తకముంటుంది.)

రంగా:- నిత్యబాబుగారు-

నిత్య:- (కొంచెం ప్రక్కకుతిరిగి) ఎవరూ! రంగా. దా-కూర్చో.

రంగా:- నిత్యబాబుగారూ అబ్బ ఏంపుస్తకమండీ యిది. ఇది చదువుతున్నంతసేపు స్వర్గంలో విహరించానంటేనమ్మండి ఇది తీసుకుని ఇంకో పుస్తకము ఇవ్వరు.

నిత్య:- (తీసుకుని) రంగారావు నువుకూడా చాలా పట్టుదలగా చదువుతున్నావ్ పార్టీనుంచి నిన్నుకూడా వెళ్ళగొడతారేమో__

రంగా:- వెళ్ళగొట్టనీయండి, వెళ్ళగొడ్తారని శాస్త్రవాల్ని మరుగుపరుస్తామా-భావదాస్యంచేస్తామా ?

నిత్య:- భలేవాడవోయి. అలాగుండాలి మనిషంటే అసలీపార్టీ వాళ్ళకు బుర్రల్లేవోయి అసలివి ఎంత గొప్ప పుస్తకాలు. అట్లాటివి ఇది అభ్యుదయ కవిత్వంకాదట

రంగా:- సత్యాం, సత్యాం చాలా గొప్పవి కదండి.

నిత్య:- రంగా. ఆటేబిల్ మీదున్నయి. నీకేంపుస్తంకావాలో పట్టుకెళ్ళు.

రంగా:- (పుస్తకాలు ఏరుకుంటుంటాడు)

నిత్య:- అసలదికాదురంగా నాకెందుకంటే మరీకష్టం కొంత మంది మనపార్టీలో అసలీ పుస్తకాలు చదవకుండానే ఈ

పుస్తకాల్ని విమర్శించడానికి పూనుకోడం ఎవడో నాయకుడు చెడ్డవన్నాడని వీళ్లుకూడా గుడ్డిగా అదేపాటపాడడం వీళ్ళకు సృష్టియిచ్చిన స్వంత బుర్రలున్నయ్‌గా. వాటితో ఆలోచించి స్వయంగా నిర్ణయాలు చేయరాదూ. ఏది మంచో ఏది చెడ్డో వాళ్ళ స్వంత బుర్రతో ఈపుస్తకాలన్నీ చదివి విమర్శించమను ఒప్పుకుంటా అంతేకాని ఎరుపు మొహాళ్ళతో మాట్లాడటమెందుకు ఉంతాల్లా అదేకాదు. ఇంకోతత్వం చూసావు రంగా ప్రేమకవిత్వాలు వ్రాయొచ్చుటగాని ఈ రకపు ప్రేమ, కవిత్వంరాయకూడదట అట్లా ఎవరన్నావ్రాస్తే అది చెత్త కవిత్వమట కమ్యూనిస్టులురాసే దొక్కుడే అభ్యుదయ కవిత్వమటబయుల్దేరాయు. సిద్ధాంతాలు తయారుచేసేవాళ్ళు. లేకపోతే కమ్యూనిస్టుపార్టీకి ఎవడన్నా పేరు సంపాయించుకోడంకోసం అనుకూలంగా వ్రాస్తే అది ఎంత చెత్తగావున్నసరే అది మహాకవిత్వమని ఆచెత్తరాతగాడు మహాకవని దేశమంతా డబ్బా కొడతారు. (ఇంతలోనే - రాజారావుగారూ, సుబ్బారావుగారూ, గోపాలరావు ప్రవేశం గోపాలరావు విద్యార్థి ఫెడరేషన్ శక్రటరీ.)

రాజా:- ఏమొయి నిత్యబాబూ, నీ వ్యవహారం మరీ ముదిరిపోయింది, ఈ ఛండాలపు పుస్తకాలు చదవకపోతే కొడ్తావా-

నిత్య:- (లేచి) ఎవర్ని కొట్టాను.!

రాజా:- ఈ గోపాల్రావుని.

నిత్యా:- ఏరా నిన్ను కొట్టానా? కొట్టలేదు కొట్టబోయాను- అంతేనా.?

గోపా:- ఆఁ ఆఁ అంతేగాని ఇంకొంచముంటే కొట్టేనాడివే.

సుబ్బా:- చదవకపోతే కొడతా నన్నమాట

నిత్యా:- నేనెప్పుడూ ఏవర్నీ నిర్బంధంగా ఏమీ చేయమనను, అది నాసిద్ధాంతమేకాదు. ఏదైనా ఇష్టముంటేనే చేయాలి లేకుంటా చేయడానికి నాకేకాదు ఎవరికీ అధికార ముండ కూడదు నాకా అధికారం లేదు. వున్నా నాకక్కర్లేదు. అసలు సంగతి అదికాదు. ఏవరో కుర్రాడు నాదగ్గర పుస్తకం తీసుకుని చదువుతుంటే ఆపుస్తకం బూతు పుస్తకమని చించబోయాట్ట. వీడికసలు తెలుసా ఏది బూతో కాదో అయినా ఈ గోపాలాన్ని నేనా పుస్తకం చదవమని ఏడుస్తానా-ఛా-నాకుర్దాపని ఆసలైనా వీడికా పుస్తకాలు చదవగల బుర్రవుందా. చదివినా అర్ధమౌతుందా నాయకులనుకుంటున్న మీకే ఆ పుస్తకాలు అర్ధంకాక నానా గొడవా చేస్తుంటే.

రాజా:- ఊఁ మస్సుర్లే అంటున్నావు. మాకే తెలియదూ. మాకేబుర్రల్లేవూ. బుర్రచెడిపోయింది నీది ఇట్లాంటి బూతు కథలు పార్టీ సభ్యులకిచ్చి.

సుబ్బా:- సభ్యులకేంటండి, నా భార్య సుశీలకే ఇచ్చాడు. ఈ ఛండాలపు బూతు పుస్తకాలు.

నిత్య:- ఎవరు చెప్పారు బూతులని. అవును మీ భార్య సుశీల గారు అడిగింది ఇచ్చాను. తనకిష్టంగా వున్నాయట యిస్తున్నాను. తప్పేముంది.

రాజ:- తప్పేముందా—బుద్ధీ జ్ఞానంలేకుండా ఆడవాళ్ళకూడా యిస్తావా.

నిత్య:- ఇదిగో మాటలు తిన్నగా రానీయండి.

సుబ్బా:- ఇదేమన్నా కమ్యూనిష్టుపార్టీ అనుకున్నావా వ్యభిచారాన్ని వృద్ధిచేయడానికి ఏర్పడ్డ పార్టీ అనుకున్నావా.

నిత్య:- ఏమో ?

సుబ్బా:- ఏమోనట - చూసారా రాజారావుగారు (పళ్లు కొరుకుతూ) ఏమన్నాడో.

రాజా:- ఇది నీవు బాగుపడటానికికాదు.

నిత్య:- (తీవ్రమైపోయి) నాకసలక్కర్లేదుబాగు (కళ్ళనీరుపెట్టుకుంటూ) నాబాగేనాడో నాశనమైపోయింది. (తల పీక్కుంటూ) ఏనాడైతే ఈ పార్టీలో చేరానో ఆనాడే నాబాగునాశనమై పోయింది.

రాజా:- నీ ఒక్కడితోపోతే మంచిదే కానీ నీ ఏ నీచాలు పార్టీకంతా పాకిస్తున్నావు. దేశానికి పాకించ తలపెట్టావ్.

నిత్య;- కాదు ఇవి నీ చాలుకావని మళ్ళీ చెప్పుతాన్నాను. ఏవి నీచాలంటే ఇన్నాళ్ళు పార్టీలోవుండి దేశసేవ-ప్రజాసేవా-పరిజాస్వేచ్ఛఅని నేచేసిన ప్రచారాలు నీచ మైనవి.

మొదటనుకున్నా, దేశాభివృద్ధికోసం పాటుపడుతున్నానని గర్వపడ్డానుకూడా. త్యాగాలుకూడా చేసాను. కాని అదంతా అబద్ధమని తేలుతూ వుంది. అదంతా దేశానాశ నానికి దారి తీసినట్లు కనపడుతున్నది. కారణం అవన్నీ నిజాలైతే ఫరవాలేదు. కాని అబద్ధాలని ఆచరణలో అనేక రకాలుగా తేలడంవల్ల ఇక నేనా అబద్ధాలు మాట్లాడదలచు కోలేదు. అబద్దాలెందుకుచెప్పావంటారేమో-చెప్పేటప్పుడు అవి అబద్దాలనుకోలేదు. అదీకాక నాకా తెలుసుకునే వయస్సుకూడా లేకపోయింది. కాని యిప్పుడు తెలుసు కున్నాను. ఎట్లానంటారేమో నిద్రలో కలకంటున్నంత సేపు కలనుకోము. నిజమేననుకుంటాం నిద్రలేస్తేగాని కళ్లు తెరిస్తే కాని అది కలని అబద్ధమని తెలియదు. అట్లా.

రాజా:- చాల్లే ఆపు. నీ ఉపన్యాసం-ఆ పుస్తకాలు మళ్ళీ కన పడితే తగల బెట్టిస్తాను.

నిత్య:- (చిన్న చిరునవ్వు నవ్వుతాడు.) అవును మహా ఘన కార్యం చేయండి, వాక్ సభాస్వాతంత్ర్యాలు కోరే మనమే ఈ పనికి పూనుకోడం చాలా సంతోషించదగ్గ విషయం.

రాజ:- అవును చెడుగెక్కడున్నా బహిష్కరించక తప్పదు.

సత్య:- అయితే మరింకా కాంగ్రెస్ ప్రభుత్వాన్ని రాత్రి పగలూ ఒకే పనిగా పక్షిలా విమర్శించడా లెందుకు మనం. మమ్మల్ని జైళ్ళల్లోకి నెడుతున్నారో, మా పుస్తకాలు నిషేధిస్తున్నారో, మాకు స్వేచ్ఛలేకుండా చేసిందో ఇది

పాసిస్టు ప్రభుత్వమో, అని ఒకటే ఏడుపు ఏడవడమెందుకు అది మనవాటిని చెడనే నిషేధిస్తున్నదేమో—

రాజా:- అదివేరు.

నిత్య:- ఇదివాగా, సమర్ధించడం చేతకాక అది వేరూ అనగానే సరిపోదు.

రాజా:- ఏమైనాసరే నీవా పుస్తకాలు చదవడానికి వీల్లేదు.

నిత్య:- వీల్లేదనడానికి మీకధికారం లేదు.

రాజా:- ఊఁ (ఒక నిట్టూర్పు విడుస్తాడు.) ఎట్లాంటి వాడవు ఎట్లా మారిపోయావు నిత్యా-నీ పదమూడో ఏట ఈ పార్టీలో చేరావు. ఇప్పుడు నీకు 18 ఏండ్లు. గొప్పనాయకుడవౌతావనుకున్నాం నిన్ను చూసి అందరూ మురిసి పోయారు. పార్టీకి పేరు ప్రతిష్టలు తెస్తావన్నారు. నేనూ సంతోషపడ్డా. నిన్ను చూస్తే ముద్దొచ్చేది. చివరికి పార్టీ ప్రతిష్ట గంగలో కలపడానికి తయారయ్యావు. చివరికి నాశనమై పోతున్నావు. కళ్ళ వెంట నాకే వస్తున్నాయి నీళ్ళు నీ పరిస్థితిచూస్తే, అసలు నీకీ జబ్బెట్లా ప్రవేశించిందో అర్ధం కాకుండా వుంది.

నిత్య:- (నిత్య కళ్ళ వెంట నీళ్ళు జలజల రాల్తాయి ఏడుపు కంఠంతో హెచ్చు స్వరంలోనే అంటాడు.)

అవును నిజమే. సరిగ్గా నా తలిదండ్రులు కూడా యిలాగే అనుకున్నారు. నాకీ పార్టీలో చేరే జబ్బెట్లా ప్రవేశించిందా

అని. మాయింట్లో ఎవరినీ ఇంతగా కాదు. ఎవరికి వేరే ప్రేమలేదు. నాకూ వాళ్ళు చాలా సంతోషం కలిగేటట్టుంచేరు.

అని. మాయింట్లో ఎవరిమీదాలేని మురిపెం వుండేది వాళ్ళకు నామీద. నేను గొప్ప చదువు చదివి పెద్ద ఉద్యోగం చేస్తానని, వాళ్ళను సుఖపెడతానని కలలు కన్నారు. మా బ్రాహ్మణ కులానికి, మాకుటుంబానికి శాశ్వత పేరు ప్రతిష్టలు తెచ్చేవాణ్ణి నేనేనని మురిసిపోయారు. కాని వాళ్ళ మురిపం సగంకూడా తీరకముందే నా పదమూడవఏటే చదువుకు స్వస్తి చెప్పి ఈ పార్టీలో చేరాను.

సర్వమానవ కళ్యాణంకోసం పాటుపడే పార్టీ అని ఒక కుటుంబ కళ్యాణమేకాదు ప్రపంచ కళ్యాణామే చూడాలని ఈ పార్టీలో చేరాను. నా తలిదండ్రులు, కంటతడి పెట్టారు. "నాశన మౌతావు చేరబోకు పార్టీలో" అన్నారు. కాదు నే బాగుపడతా, దేశాన్ని బాగుచేస్తానని సవాల్ చేశాను. దాంతో ఆశలన్నీ ఒదులుకున్నారు. చివరికి నేనంటేనే అసహ్యమై పోయింది వాళ్ళకు. నేను మంచికార్యం చేస్తుంటే వాళ్లు అసహ్యించుకుంటున్నారని నాకూ అసహ్యమేసింది వాళ్ళను చూస్తే. చివరకు దెబ్బలాటలుకూడా జరిగాయి. నా తలిదండ్రులమీదకూడా తిరగపడ్డాను. ఈ పార్టీమోజులో పడి. ఇప్పుడింకో పంథా మోజులో పడబోతున్నా. పడ్డానేమో కూడా. ఇది అనుసరించ తగ్గదో అనుసరించరానిదో ముందను భవంమీదగాని తెలియదు.

ఈమోజులో పూర్తిగా కలలోనే వుంటానో కలవిడి పోయి అబద్ధమనే తేలుతుందో చెప్పలేను. ఇంతవరకుమాత్రం అనుసరించతగ్గదేనని ఘట్టిగా నమ్ముతున్నా. నమ్ముతున్నా

కాబట్టి అనుసరించదలచుకున్నా. ఏమౌతుందో-దాన్ని గురించి ఇప్పుడాలోచించ దలచుకోలేదు. కాని ఒకటిమాత్రం నిజం నా తలిదండ్రులు పార్టీలోకొద్దు - నాశనమౌతావన్నారు. నాశన మయ్యాను. మళ్ళీ ఇప్పుడు ఇంకో బాగుకోసరం పోదామను కుంటున్నా. మీరంటున్నారు నాశన మౌతావని. ఏమౌతుందో యిప్పుడాలోచించ దలచుకోలేదు. ఏదన్నా జరిగినప్పుడే ఆలో చనచేయదలచుకున్నా, ఎందుకంటే ఎప్పుడో ఏదో జరుగు తుందని ఇప్పటినుంచే ఏడవటం అంతగొప్పలక్షణంకాదు.

రాజా:- సరే నిత్యా, నీదంతా అయోమయంగావుంది. నాకే అర్థంకావడంలేదు నీవు మాట్లాడేదేంటో. అయినా ఆఖరి సారిచెపుతున్నా నిన్ను గురించే ఈ వూరొచ్చి వారంరోజు లైంది నీకెన్నోసార్లు, ఎన్నోవిధాల చెపుతున్నాను కాని నీవు వినిపించుకోడంలేదు. నీకింకో వారంరోజులు గడువి చ్చాను. ఈ వారంరోజులూ ఈ వూళ్ళోనే వుంటాను. ఈ లోపల ఏదోఒకనిర్ణయానికి వచ్చి సమాధానం చెప్పాలి. నువ్వాపుస్తకాలు మానుకోడమో, పార్టీనుంచి బయటకు పోవడమో తేల్చెయ్యాలి. వెళుతున్నాం నిత్యా నువ్ కూడారా అట్లా బజారుపోయి కాఫీ తాగొద్దాం.

నిత్య:- (కళ్ళవెంట నీరుకారుస్తూ) మీరెళ్ళిరాండి. నాకొద్దు.

రాజా:- ఎందుకట్లా నీళ్ళు పెట్టుకుంటావు. దా-వెళదాంరా. (నిత్యబాబు చెయ్యి పట్టుకుంటాడు.) కళ్ళు తుడుచుకో.

ముఖంకూడాకడుక్కో. అవున్లే అసలు ఇంటికి వెళ్ళడంకూడా మానేశావటగా. మరి అన్నమెక్కడ తింటున్నావు.

నిత్య:- (మాట్లాడడు. ఇంకా ఏడుస్తాడు. పోయి మంచంమీద దిండులోకి ముఖం పెట్టి ఏడుస్తూ పడుకుంటాడు.)

రాజా:- (మంచందగ్గరకెళ్ళి నిత్యబాబు పక్కలో కూర్చుని) బాబూ, లే–పోనీ ప్రతినెలా నే డబ్బు పంపిస్తుంటా ఆఫీసు నుంచి–నీ ఖర్చులన్నికూడా. ఈ రాత్రి నుంచే హోటల్లో భోంచేయి. (సుబ్బారావుగారి వైపు తిరిగి) ఏదన్నా మంచి హోటలు చూసి ఏర్పాటు చేయండి.

నిత్య:-నా కోసం–మీరు బాధపడటం చాలా అనవసరం.

సుబ్బా:-నేను కాదన్నానండి. పోనీ మాయింట్లో వచ్చి తిన మన్నా అసలు మాట్లాడితేనా అతని ధోరణే మారిపోయె. అన్నం అక్కర్లేదట ఏదో స్వేచ్ఛ కావాలట, అంటాడు ప్రతిరోజూ.

రాజ:- ఏంలేదులేండి అంతా మార్చుకుంటాడు ఈ వారం రోజుల్లో, నేమార్చేస్తాగా. నాబాబు నామాట తప్పకుండా వింటాడు. బాబు నువ్వు రేపటినుంచి-కాదులే ఒక వారం రోజులు విశ్రాంతి తీసుకోబాగా. ఇకఅప్పటినుంచి పూర్వం లా నిప్పులా పార్టీకి పనిచేయాలి. పేరు ప్రతిష్టలు నీవు తెచ్చు కోవాలి. నీవు పెద్ద నాయకుడవైతే నాకు చూడాలని వుంది. ఊఁ లే-కాఫీ తాగొద్దాంలే. అదేమరి లెమ్మంటుంటే.

(బలవంతాన లేపుతాడు. నిత్య లేచి రాజారావుగారి వెంట నడుస్తాడు) రేపు వస్తుతారీకునుంచి ఒక్క 20 రోజుల ప్రోగ్రాం నీకు. 20 ఉపన్యాసాలన్నమాట. నువ్వు ఇవ్వాలి పూరూరా.

నిత్య:- లాభంలేదు. ఇవ్వలేను. నా నరాల పటుత్వమే తప్పిపోతూవుంది ఈ మనుషుల్ని చూస్తుంటే.

రాజ:- ఆదేమరి అంత నిరుత్సాహ పడితేఎట్లా. చాలామంది పార్టీసభ్యులుకూడా చాలా వూళ్ళల్లో అడిగారు నన్ను. నిత్యబాబు ఉపన్యాసాలు ఎక్కడావినపడటంలేదేమని. వాళ్ళకేం తెలుసు నువ్ మరో ప్రపంచంలో వున్నావని. పెద్దపెద్ద నాయకుల ఉపన్యాసాలు అక్కర్లేదటవాళ్ళకు నీ ఉపన్యాసమే కావలట. మంచి బుర్రకథ దళంకూడావుంది. ఆదళాన్ని నీ యిష్టమొచ్చినన్నాళ్లు తిప్పుకో నీవెంట.

(తెర)



# మూడవ రంగం

(అది ఒక బజారు. రాజారావు, జనార్ధనరావు ఒకరి కొకరు ఎదురౌతారు. రాజారావుకు జనార్దనరావు పూర్వ స్నేహితుడు. 7, 8 ఏళ్ళ అనంతరం ఇదే కలుసుకోడం.)

రాజా:- ఓ జనార్ధనరావు.

జనా:-హలో నువ్వా, రాజారావు, ఎంతమారి పొయ్యావోయి.

రాజ:- నువ్వు మాత్రం.

జన:- ఊఁ సరేగాని ఎప్పుడొచ్చావ్, ఏం పనిమీదొచ్చావ్, ఏం చేస్తున్నావ్.

రాజ:- ఇప్పుడు జిల్లా కమ్యూనిష్టుపార్టీ ఆర్గనైజరుగా వుంటున్నాకదరా, ఏదోపార్టీ పనివుంటే వచ్చాను.

జనా:- అరరె చదువు మానెయ్యగానే రాజకీయాల్లో పడ్డావన్నమాట.

రాజ:- అవునోయి దేశం అస్వాతంత్ర్యంలో వుండగా ఉద్యోగం చేయదలచుకోలేదు.

జనా:- ఆదేమిటోయి స్వాతంత్ర్యంరావడం కాంగ్రేస్సేమో ప్రభుత్వం చేయడంకూడా జరుగుతూ వుంటే నీవింకా అస్వాతంత్రమంటావ్?!

రాజ:- మీకు పొలిటిక్స్ తెలియవురా. తెల్లవాళ్లు పోగానే స్వాతంత్ర్యమొచ్చినట్లే. చా, ఎన్నటికీ కాదు, ఇది బూర్జువాప్రభుత్వం పెట్టుబడిదార్ల తొత్తు ప్రభుత్వం అ, సర్లే నువ్వేమిటి ఈ వూళ్ళో వున్నావు?

జనా:- ఇక్కడే వుంటున్నా కదరా - కలక్టరాఫీసులో— క్లార్కుగా—

రాజ:- నీకెందుకురా వుద్యోగం, మంచి ఆస్తి అదివుందిగా.

జనా:- వుంటే ఉద్యోగం చేయకూడదా!

రాజ:- అదికాదురా మీవూరొదిలి పెట్టి, ఈ వూళ్ళో అద్దె కొంపల్లో-ఆఁ సర్లే మీనాన్నా వాళ్ళంతా బావున్నారా.

జనా:- లేదురా పోయారు.

రాజ:- అరరె చచ్చి పోయారా-పాపం.

జనా:- ఇంతకీ పెండ్లి చేసుకున్నావురా.

జనా:- ఆ చేసుకున్నారా. రాయింటికి వెళదాం. చూద్దువు గాని మరి నువ్వో?

రాజా:- మనం కొన్నాళ్ళు దేశంబాగు పడేదాకా చేసుకో దలచలేదు. ఆఁ అయితే ఏవూరు అత్తవారు.

జనా:- ఇక్కడే ఇక్కడికి 20 మైళ్ళ దూరముంటుంది నిమ్మ కాయల పాడని.

రాజా:-కట్నంబాగా గుంజావా' కట్నాలు తీసుకో కూడదురా.

జనా:- కట్నానిదేముందిగాని వాళ్ళకి నా భార్య ఒక్కతే కూతురు. 50 వేలకుంటుంది వాళ్ళ తదనంతరం మాకే నన్నారు. అయినా నాకు వాళ్ళ ఆస్తికావాలని లేదు. పిల్ల బావుంది. గుణం మంచిది. అదే చాలనుకున్నా.

(తెర)

———

(5)

# నాల్గవ రంగం

(జనార్దనరావిల్లు-జనా-రాజా-ప్రవేశం.)

జనా:- కూర్చోరా ఆ కుర్చీ మీద.

రాజ:- (కూర్చుంటాడు).

జనా:- (నుంచునే లోపలికి చూస్తూ) లలితా, ఏయి లలితా.

లలిత:- (లోపల్నించే కేకేసుకుంటూ) వస్తున్నానండీ (వచ్చి మళ్లీ పరాయివారున్నారని వెనక్కి తగ్గుంది).

జనా:- (భార్యను సంబోధిస్తూ) లలితా రారా ఫరవాలేదు స్నేహితుడేలే - నా చిన్ననాటి స్నేహితుడు ఇవ్వాళ నా స్నేహితుడికి ఏం పిండివంటలు చేసి పెడతావో మరి. ఆఁ ఇదిగో లలితా ముందు వేడినీళ్లు పెట్టు స్నానంచేస్తాడు.

రాజా:- ఆఁ ఎందుకు రా - ఇప్పుడనాక తిరిగి పోతాను.

జనా:- అదేమిటోయి స్నానంచేసి భోంచేసిపోదువుగాని, ఇవ్వాళేకాదు నీ దిక్కుడున్నన్నాళ్లూ ఇక్కడికే రా భోజనానికి. నేను వూళ్లో వున్నా లేకపోయినాసరే ఏం సిగ్గుపడ నవసరంలేదు భోంచేసి పోతుండు. ఆఁ ఇంకా ఏమిట్రా సంగతులు.

రాజ:-సంగతులా బోలెడు. నీకు మంచి లిటరేచరిస్తానుచదువు.

జనా:- నాకెందుకురా, అయినా తీరికుండదు. ఎప్పుడూ కలక్టరు వెంట క్యాంపులలోనే సరిపోతుంది.

రాజ:- అదేమిటోయి తప్పక తెలుసుకోవాలి రాజకీయాలు. అందులో నీవు N. G. O. వు. నిజంగా N. G. O. లైన

మీారు ఈ తక్కువ జీతాలతో చాలా సఫరాతున్నారు. కానీ ఈ కాంగ్రెస్ ప్రభుత్వం మీా సంగతే ఆలోచించడం లేదు. ఖచ్చితంగా ఇది క్యాపిటలిస్టు ప్రభుత్వం. మీాబాధలు పోవాలంటే సమ్మెలు చేయాల్సిందే - పోరాడాల్సిందే.

జనా:- నాకేం బాధల్లేవురా నేను దేనికీ యిబ్బంది పడటం లేదు.

రాజ:- అవునోయి నీవు వున్నవాడివికాబట్టి ఇబ్బంది పడటం లేదు. కాని తక్కువ వాళ్ళ సంగతో - నీబాగు నీవుచూాసు కోడమే కాదు గొప్పతనం నీతోటివాళ్ళ బాగుకూడా చూడాలి. అదే త్యాగం ఆ త్యాగమేకావాలి ప్రతివాడికి ఆనాడే దేశం బాగుపడుతుంది.

జనా:- లలితా - ఏయి లలితా.

లలిత:- (వచ్చి) నీళ్లు కాగుతున్నాయండి.

జనా:- నీళ్ళు సరేగాని ముందు కాఫీ పెట్టు. వీడు నా బాల్య స్నేహితుడు ఇప్పుడేమిటో తెలుసా వీడు. జిల్లా కంతటికి నాయకుడు,కమ్యూనిస్టుపార్టీ నాయకుడు. (రాజారావుతో) రారా లోపలి ఇల్లు మాసంసారం చూద్దువుగాని.

(ఇద్దరూ లేచి లోపలికి వెళతారు)

(తెర)

# ఐదవ రంగం

(నిత్యబాబుగది, తన గదిలో పడక కుర్చీలో పడుకొని నిద్ర పోతూవుంటాడు ఒళ్ళో తెరచిన పుస్తకం ఒకటి పడి వుంటుంది. సుశీల గదిలోకి ప్రవేశిస్తుంది. ప్రవేశించీ-నిత్య బాబును చూస్తూ-)

సుశీల:- అహా_ఎంత గొప్పగావున్నాయి నీకళ్ళను కప్పిన రెప్పలు. నిండు యవ్వనంలో వున్నావురా నిత్యా-ఏం తెలివి తేటలురానీవి ఉపన్యాస మిస్తే నా మొగుడేంపని కొస్తాడు నీ ముందు. కథలుకూడా వ్రాస్తావుకదరా నిండా 20 ఏళ్ళున్నా లేవు-నాభర్త సుబ్బారావు-ఛీ-38ఏళ్ళు నాయకుడనేగాని ఏముంది నా మొగుడిదగ్గర. ఎద్దులాగ వెధవ రూపం ఒక అందమూ చందమూ పాడుముఖం-అబ్బ ఎంత బాగుందిరా నీమోము. (అటూ, ఇటూ చూసి) అమ్మో తలుపువేసి రాలేదు. ఎవరన్నా వస్తే గడిబిగించి వస్తాను. (పోయితలుపు మెల్లిగా చప్పుడే లేకుండా గడివేసి వస్తుంది.

వచ్చి - నిత్యబాబుకు దగ్గరగా వెళ్ళి) ఎన్ని దినాల నుంచి నీ స్పర్శ సుఖంకోసం తపించిపోతున్నాను. రాత్రులకు రాత్రులు నిద్రలేకుండా మనసంతా నీమీదే పెట్టుకుని

(మెల్లిగా నిత్యబాబును తాకి నిత్యబాబు పెదాల్ని తన పెదాలతో ముద్దుపెట్టుకుంటుంది. నిత్యబాబు చేతుల్నితన రొమ్ముమీదకు లాక్కొని బాగా అదుముకొంటుంది)

ఆహా జన్మ పావనమైంది. తరించింది.

నిత్య:- (అమాంతం ఉల్లిపడిలేచి తన చేతుల్ని విసురుగా లాక్కొని) ఎవరూ? మీరా! సుశీలగారా!! ఇదేమిటిపని!!!

సుశీల:- నీదగ్గర స్వర్గసుఖం కోసం వొచ్చాను.

నిత్య:- కమ్యూనిస్టులమైన మనకు అసలు స్వర్గమేలేదుగా- అట్లాటప్పుడు ఇంకా స్వర్గసుఖ మెట్లావుంటుంది- ఐనా ఆ సుఖం మీ భర్తగారిదగ్గర - నేను మీ భర్తనుకాదు.

సుశీల:- అది - ఆ స్వర్గ-కాదు నిజంగా మనకుస్వర్గంలేదుగా- అదే ఆమధుర సుఖం వారిదగ్గర దొరక్కనే నీదగ్గర కొచ్చాను.

నిత్య:- వందమందిలో వివాహం చేసుకున్నదానివి నీచేతుల్తో ఆయన మెళ్లో పూలదండ వేసిందానివి నీభర్తను మోసం చేసి ఈవిధంగా-

సుశీల:- మోసమోసమో నాకు తెలియదు. నాకు కావాల్సింది సౌఖ్యం నాకాసౌఖ్యం నీదగ్గర తప్పఇంకెవరిదగ్గరా దొరకదు. తృణీకరించకు. అందులో పెద్దదాన్ని నోరుజారి అడిగాను- తపించిపోతున్నాను, పోనీ నే స్త్రీ కాదా-నాకన్నా యింకే అందగత్తె నైనా ప్రేమించావా.

నిత్య:- ఆఁ ప్రేమించాను సత్యను.

సుశీల:- ఆఁ సత్యావాణీనా, సత్యవాణీ, నువ్వెంత అదృష్టవంతు రాలివే-సత్యను ప్రేమించావా.

నిత్య:- మామూలుగా కాదు, నా హృదయంలోని ప్రతి అణు వణువుతో-కానీ నిన్ను మాత్రం కలలోకూడా ప్రేమించలేదు.

నీవంటే ఇష్టమూ లేదు అయినప్పటికి, నా కోసందిన రాత్రా లుతపించి పోతున్నానని ఏడుస్తున్నావుకాబట్టి, నిన్ను తృణీ కరించను నీకోనాకానందం లేక పోయినప్పటికీ-నేనే నీకానం దమంటున్నావుకాబట్టి-అందులో తృణీకరిస్తే చచ్చిపోతా వేమో పాపమని తప్పక నీకోర్కె తీరుస్తాను.

సుశీల:- (పరమానందంతో ఎగిరి నిత్యాబాబు ఒళ్ళంతా ముద్దు పెట్టుకుంటుంది.)

నిత్య:- (చిరాకుతో సుశీలనుతోసి) ఏమిటిది పాడుమూతిపెట్టి ఒళ్ళంతా ముద్దుపెట్టుకుంటావు. దూరంగావుండు. ముందు నీభర్తకు విడాకు లివ్వరా, లేకపోతే నిభర్తకు ముందుగా చెప్పి నాతో కలవడానికి ఒకపర్మిట్ పట్టుకురా!

సుశీల:- పర్మిటా-ఛీ-విడాకులా- అమ్మో నాపరువేం కేమన్నా వుంటుందా-తాలూకా మహిళా సంఘనాయకురాల్ని-తా లూకాపార్టీనాయకుడైన నాభర్తకు విడాకులిస్తే లేకపోతే పర్మిట్ అడుగుతే అంతా "ఛీ" అనరూ-

నిత్య:- మరిచాటుగా భర్తకళ్ళుకప్పి ఇట్లావచ్చి పిచ్చి పిచ్చిగా పరాయివాణ్ని ముద్దు పెట్టుకోవడం నీచంకాదూ-? తప్పు కాదూ?

సుశీల:- ఇదెవరూ చూడటంలేదుగా-నాబాబుకదూ- (మళ్ళీద గ్గరకుపోయి నిత్యను తాకుతుంది)

నిత్య.- (చేండి పడుతూ దూరంగా నెడుతూ) ఏమి ఏమిటిది చెపుతుంటే దూరంగా వుండు, తాకావంటే మర్యాదగా

వుండదు. (సుశీల వెనక్కు జరుగుతుంది) చూడకపోతే గడ్డితిన్నా ఫరవాలేదన్న మాట, చూసేటప్పుడే అన్నం తినాలన్నమాట. ఎంత నీచమైన అభిప్రాయాలు అటు విడాకులిస్తే పరువుప్రతిష్టా పోతుందని భయమూ-ఇటేమో చాటుగా సుఖంకావాలా ఓహో ఏం గొప్ప అలోచనలు మహిళా సంఘాలల్లో వుపన్యాసాలిస్తావు కాబోలు, హిందూ సంఘంలో చాటు వ్యభిచారాలు జరుగుతున్నాయని, కడుపులు తీయించు కుంటున్నారని అదినీచమని, కమ్యూనిస్టు సంఘంలో అట్లాంటి దేమీ లేదని, నీవూ, నీభర్తా కూడా ఎన్నిసార్లు ప్లాట్ ఫారాలమీద పక్షుల్లావాగారు. ఇప్పుడు నువ్వే హిందూసంఘంలో కన్నా నీచంగా ప్రవర్తించడానికి తయారయ్యావే ఎందుకా సిగ్గులేని ఉపన్యాసాలు.

సుశీల;- నీదగ్గర కేదో వచ్చానని నీ యిష్టంవచ్చినట్లు మాట్లాడుతున్నావ్, పోన్లే పోతున్నాలే. (పోతుంది)

నిత్య:- (వెళ్లేసుశీలను కేకవేస్తాడు) సుశీలగారు, ఓసుశీలగారూ.

సుశీల:- (తిరిగివచ్చి) ఎందుకూ ?

నిత్య:- అబ్బే ఏమీ లేదు. మనసుకష్టపెట్టుకున్నారేమో క్షమించండి. కాని ఒక్కవిషయం చెపుతాను ఓపికపట్టగలరా-

సుశీల- ఏమిటది.

నిత్య-ఆఁ ఏమీలేదు-ఇంకా ఎట్లాగైన కొద్దిరోజుల్లో నేను ఈ పార్టీ బందిఖానానుంచి బయట పడదలచుకున్నా ఇక అప్పటినుంచి ఎన్ని తప్పుడు పనులైనా చేయదలచుకున్నా. అంటే పార్టీలోవున్న వాళ్ళంతా నీతి పరులనుకో

కండి. అంటే అర్థం. అన్ని రకాల అవినీతులు, నీచాలూ, పార్టీలో వుండి చాటుగా చేస్తూ తాము గొప్ప నీతిపరులలా నటిస్తున్నారు కొందరు. అదినాకిష్టంలేదు. పార్టీలో వున్నంతవరకూ నీతిగానే వుండదలచుకున్నా. కానీ ఈ నీతులు-ఈ నటించటాలూ నాకు కుదరవ్. అందుకే బయటకు పోదలచు కున్నాను. అప్పటిదాకా ఓపికపట్టండి. ఇప్పుడు మాత్రం-బయటకు వెళ్ళండి, అప్పుడుమీరేంచేయ మంటే అదిచేస్తా.

సుశీల:- నీ కొత్త సిద్ధాంతం ప్రకారం ఎవర్ని పడితే వాళ్ళను ఎట్లా పడితే అట్లా చేయొచ్చుగా, మరి ఇట్లా అంటావేం?

నిత్య:- నిజమేకాని, చెప్పాగా కారణం, పార్టీనుంచి ఇంకా బయటకు పోలేదుకాబట్టని. అందుకని ఇంకా తీరిటికల్‌గానే పోతున్నా. పార్టీనుంచి బయట పడగానే ప్రాక్టికల్‌గా దిగుతా. కాబట్టి అప్పటిదాకా ఓపికపట్టి ప్రస్తుతానికి మాత్రం నన్ను వదిలి బయటకు వెళ్ళండి.

సుశీల:- వెళ్తూనే వున్నా (వెళ్ళిపోతుంది.)

(తెర)



# ఆరవ రంగం

(జనార్దనరావు ఇల్లు, ఇంట్లో లలిత ఒక్కతే వుంటుంది. ప్రక్కమీద వెల్లకిలా పడుకొని ఇంటికప్పు వేపుచూస్తూ ఏవో అర్థంకాని వూహల్లో విహరిస్తూ వుంటుంది. కాసేపు ప్రక్కనే వున్న కమ్యూనిస్టుపార్టీ పుస్తకంతీసి చదువుతూవుంటుంది. లలిత ఈ రెండు రోజుల్లో పూర్తిగా మారిపోయిందని చెప్పొచ్చు. దీనికంతా కారణం 3 రోజులుగా సాగిస్తున్న రాజారావు కమ్యూనిస్టు మతబోధే. మళ్లీ పుస్తకం అక్కడ పడేసి తలుపు ఒంక చూస్తోంది. ఇంకా రాజారావు రాలేదేమాఅని రాజారావు మాటలు వినకుండా ఒక్కక్షణం గడపడంకూడా తనకు కష్టంగావుంది.

(రాజారావు తనకు నిన్న నేర్పిన పాట పాడడంప్రారంభిస్తుంది. యాక్షన్ చేస్తూ - కొంచెం ఒళ్ళుకూడా కదుపుతూ అడుగులు మారుస్తూ)

పాట.

వేడిరక్తం, పొంగిపోయే యువకులూ ఓహోయి యువతులూ
కలిసి పదుండే సమయంకాదిది రండోయి
పోయారగ్రా పరాయివాళ్ళూ ఇంగ్లీషోళ్ళూ
వొచ్చారగ్రా మనవాళ్లూ కాంగ్రెస్సోళ్ళూ
ఎక్కారరా మనమీద ఇదికాదు స్వతంత్రం
మనమీదెక్కే తంత్రం స్వతంత్రమెట్లాగౌతుందారా
అసలు స్వతంత్రం వేరేవుంది

అది మీరంతా - వ్రాస్తేవ్రాసుంది
ఆడా - మొగ లందగువ్రాస్తే వ్రాస్తుంది.

(బయట తలుపుమీద చప్పుడు విని పాటఆపి, ఎవరూ? అంటూ తలుపుతీస్తుంది. రాజారావు ప్రవేశిస్తాడులోనికి మీరా రాండి - ఇంత ఆలస్యమైందేం అంటుంది లలిత.

(లలిత—రాజారావు లిద్దరూ కలిసి ప్రక్క దగ్గర కొస్తారు.)

లలిత:- కూర్చోండి—ఆప్రక్కమీద.

రాజా:- మీరుకూడా వచ్చి కూర్చుంటే—

లలిత:- నేనా—? !

రాజా:- అవును-ఏం తప్పులేదు-మనభావం సోదర భావంగా వుండాలేగాని, మనం ఎక్కడకూర్చున్నా-ఎట్లాకూర్చున్నా-ఏంచేసుకున్నా తప్పులేదు. ఆభావం మాత్రంసోదర-సోదరీ భావంగా వుంటే చాలు.

లలిత:- (అట్లానే నుంచుని రాజారావును చూస్తూవుంటుంది).

రాజా:- చూసారూ లలితగారూ, మన హిందూ ఇజంచాలా అన్యాయం చేసింది ఆడవాళ్ళకు ఆడా-మొగా కలిసి తిరిగితే తప్పు, మాట్లాడితే తప్పు.-మాట్లాడితే ఏముందండి అనేక విషయాలు బ్రదర్ అండ్ సిస్టర్‌లాగు మాట్లాడుకో వచ్చు. మన వాళ్ళకు అసలు సోషల్ మువింగే తెలియదు. రాండీ-కూర్చోండి-(లలిత చెయిపట్టుకులాగి తన ప్రక్కన కూర్చోపెట్టుకుంటాడు.)

లలిత:- అవునండీ- మరీ మూడురోజులబట్టీ మీరు చెప్పేదంతా వింటుంటే నాకూ సోషల్‌గా తిరగాలని - ఏదో చెయ్యాలనిపుడుతూవుంది.

రాజా:- అవును పుడుతుంది - అదే పుట్టాలి. అసలు మా సోవియట్ దేశం సంగతిచెపితే ఒక్కసారి రెక్కలు కట్టుకొని ఎగిరిపోదామంటారు.

లలిత:- (ఇంకా బాగా రాజారావుదగ్గరకు జరిగి) చెప్పండి- చెప్పండి అయితే-

రాజ:- (తన శరీరాన్ని లలితకు బాగా తాకిస్తూ) అక్కడఆడవాళ్లు - మొగవాళ్ళు - ఓహో ఏం కులాసాగ తిరుగుతారు. భూతల స్వర్గమంటే నమ్మండి - ఆడా - మొగ మధ్య, డిఫరెన్సే లేదక్కడ. ఆడవాళ్ళుకూడా ఉద్యోగాలు చేస్తున్నారు. యుద్ధాలు చేస్తున్నారు. ఆడవాళ్ళలో మహాకవులుకూడా వున్నారండి. వాళ్ళు ఎట్లారాస్తారనుకున్నారు అవి చదువుతుంటే ఇట్లా కదలిపోతాంమనం (లలిత చేతిని తన చేతిలోకి తీసుకుంటాడు)

లలిత:- నాకూ చదువుకుండే రోజుల్లో వుండేదండి. కథలు వ్రాయాలని-కాని పెండ్లైంది అంతా పోయింది.

రాజ:- ఓ దానికేమండి-ఇప్పుడు డెవలప్ కావచ్చు మీరు గొప్ప కవయిత్రి కావచ్చు కానీ ఈ వాతావరణంలో కుదరదు. కారణమేమంటే-మీ హజ్‌బెండుకు వంటచేసి పెట్ట

డం- ఆయనచెప్పే ఆఫీసు కబుర్లు వినడం-ఇదేగా మీ దిన చర్య. ఇలాగుంటే లాభంలేదు.

లలిత:- నిజమేనండి-మీరన్నట్టు. ఎప్పుడు ఆయనతో మాట్లాడినా. ఆయన కలక్టరుగారి సంగతి ఆయన ఆఫీసు సంగతే గాని-దేశం సంగతి ఒక్కటీ మాట్లాడరు. నాకూ విసుగు పుడుతూ వుంది ఆయనపురాణంతో.

రాజ:- అసలాయనకు తెలిస్తేగా.

లలిత:- కానీ మావారు చాలామంచి వారండి నన్నెప్పుడూ ఏమీ అనరు.

రాజ;- కాని ఏం లాభం జీవితానికి అసలు విషయం వదలి పెట్టినప్పుడు.

లలిత:- అదేకాదండి - ఎప్పుడూ క్యాంపులే. చూడండి ఇప్పటికి పోయి మూడురోజులైంది. ఎప్పుడొస్తారో ఏమో అంటుండదు. పైగా ఈకొంపలో నేనొక్కదాన్ని బిక్కు-బిక్కుమంటూ ఏమీ తోచక కొట్టుకుంటూ వుంటాను. సరే గాని ఎట్లాగైనా మళ్ళ వారు క్యాంపునుంచి వచ్చేటప్పటికి 3 రోజులన్నా పడుతుంది. ఈ మూడురోజులు ఆయన వచ్చిందాకా మీ రిక్కడే వుండాలి.

రాజా:- ఎట్లా పార్టీపనులు బోలెడు వున్నాయి.

లలిత:- పోనీ అట్లాగైతే పార్టీపనులు పగలు చూసుకోండి రాత్రులు ఇక్కడకొచ్చి పడుకోండి. లేకపోతే ఒక్కదాన్ని నాకు భయంగా వుంటుంది.

రాజా:- అట్లాగేలెం?.

లలిత:- సరేగాని ఈ వేళ సినిమాకు పోదామండి మంచిసినిమా అట.

రాజ:- మీరు సినిమాలు బాగా చూస్తారన్నమాట.

లలిత:- ఏం చెయ్యమంటారు ఏం తోచక.

రాజ:- (లేచి నుంచుని) కాని వెధవ సినిమాలండీ ఇప్పుడొచ్చే వన్నీ- (ఈ కథాకాలంనాటికి కమ్యూనిస్టులు ఇంకా సినిమా రంగంలోకి రాలేదు.) వెధవ సెక్సు అప్పీల్ తప్ప ప్రజల కుపయోగపడే సినిమా ఒక్కటొస్తున్నదండి. తుక్కు డ్యాన్సులు. అంతా చెత్త - చూడండి ఆపోజ్ లెంత ఆక్వర్డ్‌గా వుంటాయో మీకొక పోజ్ చూపిస్తాను.(లలితకు ఎదురుగానుంచుని) మీరుకూడా నాలాగా ఎదురుగా నుంచోండి (లలిత నుంచుంటుంది) మీరిట్లా వున్నారనుకోండి మీ రొమ్ముల్ని విపరీతంగా కనపడేటట్లుచేస్తాడు డైరెక్టరు గాడు (తన చేత్తో లలిత రొమ్ములమీద చీర తొలగిస్తాడు) చూడండి మిమ్మల్ని మీరు అద్దంలో చూచుకోండి- ఎట్లా వుంటుందో - ఎంత అసహ్యంగా వుంటుందో (లలిత కళ్ళు ఒప్పచెప్పి చూస్తూవుంటుంది) అంతటితో అయిందా ఇక నాయకుడొస్తాడు కిందికీ పైకీ చూస్తాడు. ఆహా ప్రియసీ అంటాడు. నీ నడుమూ, నీ కళ్ళూ, అని ఇట్లా (లలిత నడుము తనమీదకు వాల్చుకుంటాడు లలిత రాజారావు చేతులమీదకు వాలిపోతుంది)

(ముద్దుకు ఒంగుతాడు లలితమీదకు, తెల్లటి కర్టెన్ పడు తుంది. రాజా, లలిత, నీడలు కర్టెన్ మీద కనపడు తుంటాయి. లలితను ఒక ముద్దుగట్టిగా పెట్టుకుని) అబ్బ, ఎంత అందంగా వున్నావు, నిజంగా అదృష్ట వంతుణ్ణి, నీలాంటి సౌందర్యవతి నా చేతుల్లో, నాముద్దు నామో దిస్తూ, ఇలా-అబ్బమరచి పోలేను, ఏది లలిత మరొక్క సారి, అబ్బ (ముద్దుపెట్టుకోడానికి మళ్ళీ ఒకసారి ఒంగు తాడు, లలిత తప్పించుకొని పారిపోతుంది. పారిపోతున్న లలితను పట్టుకుంటాడు. మళ్ళీ జారిపోతుంది. మళ్ళీపట్టు కుంటాడు. గట్టిగా ముద్దు పెట్టుకుంటాడు.)

లలిత:- స్వర్గం లాగుంది. రాజారావు.

రాజా:- భూతల స్వర్గమను (అమాంతం ఎత్తుకొని మంచం మీద పడేస్తాడు లలితను. (ఒక్క 5 నిమిషాలు దీపాలారి పోతాయి.

(తెర పడి పోతుంది)

---

# ఏడవరంగం

కర్టెన్ లేస్తుంది.

(కిందటి రంగపు స్థలమే)

(లలిత మంచంమీద మోచేతిమీద తలపెట్టి పడుకొని వుంటుంది రాజా గాపు దగ్గరగా ఆనుకుని బాతాకాని ప్రారంభిస్తాడు).

రాజ:- కల్పనాదత్ చిటగాంగ్ విప్లవంలో...

లలిత:- (అమాతంలేచి కూర్చుని) విప్లవం! రేలెండి-నాకేంటో భయమేస్తుంది - మావారికి తెలిస్తే - అమ్మో - ఏమౌతుందో.

రాజా:- ఏం భయంలేదు. అయినా మీఆయన క్యాంపులో వున్నారు ఇంకో మూడురోజులు ఆనందంగా భూతల స్వర్గంలో గడిపేద్దాం తరువాత నే వెళ్ళిపోతాగా ఇంకెవరికి తెలుస్తుంది.

లలిత:- వెళ్ళిపోతారా, మూడురోజుల్లో, నన్ను ఒంటరిదాన్ని చేసి

రాజా:- వెళ్ళకపోతే ఎలాచెప్పు జిల్లా ఆఫీసు ఒక గంట నను వదు నేను లేకపోతే మళ్ళీ ఎప్పుడన్నా వస్తాలే.

లలిత:- అంతే లెండి-మీకేం మొగాళ్ళు. ఒక్కక్షణంలో అంతా మరచిపోతారు. కానీ నేనో యువతిని-మీచేతుల్లో రేగిన యవ్వనోద్రేకం, ఆ పొంగు మీతో అనుభవించిన

ఆనిండు సంతోషం మరవలేను, నా హృదయంపై పడ్డ మీ గాఢమైన ముద్రను యుగాలకూడా మరచి పోలేను ఇంతకుముం దసలు ప్రేమనేదే ఎరుగను, ప్రేమ నేర్పేరు. ఆనందంలో ముంచారు ఇకమీరు లేకుండా ఒక్కక్షణం కూడా బ్రతక లేను.

రాజా:- వుండు ఆలోచిస్తున్నాను. ఒక గొప్పప్లానే దన్నా దొరుకుతుం దేమో (కాసేపు ఆలోచనగా అటూ ఇటూ తిరిగి, ఒక్కసారి హుషారుగా గంతేసి) ఆఁ లలితా దొరికింది, ఒకగొప్పప్లాను.—ఏమీలేదు – యిమ్మీడియట్‌గా అంటే వెంటనే నీభర్తను చంపెయ్యాలి.

లలిత:- (గాబరాగా) ఆఁ మావారినా, నిండు నిప్పుముందు వివాహం చేసుకున్నానే.

రాజా:- అవును ఇప్పుడు నిండుప్రేమ ముందు నీభర్తచంపెయి నా ప్రేమ కావాలంటావా నీ భర్తను చంపెయి. ఒక్కర్లే దంటావా నీభర్తతోనే వుండు.

లలిత- నా కక్కర్లేదు. నా భర్త మీరే కావాలి మీకోసం ఏమైనాచేస్తాను. ఎట్లా చంపాలో చెప్పండి ఎవరికీ తెలియకుండా.

రాజ- నేనొక పొడిస్తాను రేపు నీకు విషంకన్నా అమోఘంగా పనిచేస్తుంది. నిమిషాలమీదే – మీ ఆయన క్యాంపునుంచి రాగానే నేనూ కాఫీ కొస్తాను, కాఫీముందు ఫలహారంకూడా

పెట్టు విూ ఆయన కిచ్చే మంచినీళ్ళ గ్లాసులో వెయ్యి నే నిచ్చే పొడి ఇక చూడు.

లలిత- విషపుపొడి - విషమూ - మావారికి నా చేతులతోనే ఆయన కింకెవరూ లేరు నేనొక్కదాన్నే ఆయన కీ ప్రపంచంలో అనుకుంటూన్నారు. అట్లాంటివారిని నన్ను నమ్మిన మావార్ని నా చేతులతోనే విషం-మోసం కాదండి-పాపం కాదండి ఘోరంకాదండి (బావురుమని రాజారావుమీాదపడి ఏడుస్తుంది.)

రాజ- మోసమేమిటి - ప్రేమకోసం ఏమన్నా చేయొచ్చు - ఏడవకు నువ్వేడుస్తే నాకూ ఏడొస్తుంది

లలిత- బర్తగారిన్నికూడానండి (ఏడుపు మానుతుంది).

రాజా:- బర్తనేమిటి దేశభక్తుల వీరగాథలు వింటే హడలెత్తి పొతావ్, దేశంకోసం తండ్రుల్నీ- తల్లుల్నీ కూడా కాల్చేసిన వీరులున్నారు. అట్లానే ప్రేమకోసంకూడా వందమంది బీదవాళ్ళకోసం ఒక ధనవంతుణ్ణి ఖూనీచేసినా తప్పులేదంటుంది మాపార్టీ అట్లానే ఒక గొప్పప్రేమకోసం ఒకభర్త ప్రాణాన్ని ఒక భార్య తీయొచ్చు. అదీ చాలా సంతోషంగా, మంచినీళ్ళప్రాయంగా అంగుళం విచారంకూడా లేకుండా. పిచ్చిదానా నీ భర్తతో నీకు పరిచయమై మహా అయితే 3, 4 ఏండ్లనుంచి, కాని నాకో చిన్నతనంనుంచి ఐనప్పటికి, అంత స్నేహమున్నప్పటికి నీమీాది ప్రేమనన్నట్లా గొంతు కోయమంటోంది.

లలిత:- అయితే చంపుతాను - తప్పకుండా నాభర్తను నేనే మిషమిచ్చి - చంపింతసు చాత.

రాజ-- అదే చెప్పబోతున్నా నీ భర్త చావుతో మన ప్రేమ కాటంకం తొలగిపోతుంది. నీవు విడో వవుతావు (వెధవ రాలు) అప్పుడు నిన్ను నేను విడోమ్యారేజిచేసుకుంటాను.

లలిత:- బర్తచచ్చిన బార్యను వివాహం చేసుకుంటే మీా కప కీర్తి రాదండీ.

రాజ:- (పెద్దగానవ్వి) అపకీర్తా-పిచ్చిపిల్లా నీ వింకా పాతకాలం లోనే వున్నావు ఈ రోజుల్లో విడోమ్యారేజీలకు, లవ్ మ్యారేజీలకు వున్నంత విలువ, వచ్చేకీర్తి మరే కాలంలో లేదు. లలితా-నాకేకాదు నీకు కూడా వస్తుంది ఒక గొప్ప కీర్తి, నీ పేరూ నా పేరూ పత్రికలనిండా పడుతుంది. సంఘ సంస్కర్తల ప్రపంచం బహ్మారథంపడుతుంది మనకు. ఇందు కునీ కింకోగొప్ప అవకాశంకూడా కలగొచ్చు, మహిళా సంఘానికి నాయకురాలుగా అయ్యే అవకాశాలుకూడా కలగొచ్చు.

(తెర)

# ఎనిమిదవ రంగం

[కమ్యూనిస్టుపార్టీ కార్యాలయం. పార్టీ సభ్యులంతా నిశ్శబ్దంగా వున్నారు. కొందరు సంతోషంగానూ మరికొందరు విచారంగాను వుంటారు ఒక మూల నిత్యబాబు చేతులు కట్టుకుని నుంచునివుంటాడు. జిల్లా నాయకుడు రాజారావుగారి పెదాలు కదులుతూవుంటాయి.]

రాజా:- కామ్రేడ్స్ ఈనాడు అతి ప్రధానమైన సమస్య మీయందరిముందూవుంది. దేశమంతా చాలా అధోగతిలో వుంది. అలాంటిసమయంలో ప్రజాసేవకులమైన మనం మన బాధ్యతను గుర్తించి ఆదర్శంగా ప్రతిఒక్కరూ ప్రవర్తించాలి. కానీ ఆ బాధ్యతను పూర్తిగా మరచిపోయి మన నిత్యబాబు వూహాల్లో విహరించే కవుల సాహిత్యాన్ని ప్రచారంచేయడం మొదలుపెట్టాడు. ఆ కవుల భాషాశైలీ మంచిదే, అంతవరకూ నేనూ ఒప్పుకుంటాను. వాళ్లుమహాకవులనికూడా ఒప్పుకుంటాను. కాని వాళ్ళ భావాలు మాత్రం మంచివికావు. భౌతికవాదులమైన మనకు అసలే పనికిరావు. అందువల్ల నిత్యబాబును మౌనమనిచెప్పాం.అదే కాకుండా దీనివల్లపార్టీలో అరాజకం ప్రారంభమైంది కక్షలు కూడా ప్రారంభమయ్యాయి. పార్టీమీద కొందరువాళ్లు ఎదురు తిరగడంకూడా నేర్చుకున్నారు. ఇది పార్టీక్రమశిక్షణకే భంగకరం. అదేకాకుండా స్త్రీలతో అత్యంత సోదర భావంతో మెలగ వలసిన మనం, కట్టుబొట్టాలలో నీతిగా వుండాల్సిన మనం స్త్రీ పురుషులను అరాచకానికి దింపే,

వ్యభిచారుల్ని చేసే వెధాంతాన్ని చేసే ఆపుస్తకాలను మన నిత్యబాబు చదవడం మార్జించ తగ్గది కాదనుకుంటా. స్త్రీ లంటే ఎవరు? 30 ఏండ్లలోపు వాళ్ళంతా మన అక్కలూ చెల్లెళ్ళూ. 40 ఏండ్లపై వాళ్ళంతా, మన తల్లులు మన అమ్మమ్మలూ అట్లా మనం భావించాలి స్త్రీలను. అసలే మనప్రతి రేకులు మనమీద వేయరాని నిందలు వేస్తున్నారు. మనం ఎంతో నీతిగా వుంటున్నప్పటికి అట్లాంటిది స్త్రీలతో మన మెల్లాగుండాలి నిప్పులాగుండాలి. కనుక నిత్యబాబు ఇప్పుడు ఖచ్చితమైన సమాధానం చెప్పవలసి వుంటుంది అతనా పని మానుకోకపోతే పార్టీకి దూరం అవ్వాల్సి వస్తుందని చెప్తున్నాను. ఒకనాడతనికి నాచేతులతోనే ఎర్రపతాకాన్ని బహూకరించాను. అచేతులతోనే ఈనాడు పార్టీ గౌరవం నిలబెట్టడం కోసం స్త్రీల గౌరవం నిలబెట్టడ కోసం అతన్ని పార్టీనుంచి బయటకు పంపించాల్సివస్తున్నది. ఇది నాఒక్కడి అభిప్రాయమే కాదనుకుంటా పార్టీ సభ్యులందరి అభిప్రాయమే. సభ్యులందరి ఆమోదమే దీనికి, అనుకుంటా.

సభ్య-రంగా:- (లేచి) అందరి ఆమోదం అనడం పొరపాటు. నే నామోదించను నిత్యబాబుగారు పార్టీకోసం అహర్నిశలూ పాటుపడ్డాడు. ఆ పుస్తకాలు చదువుతున్నంత మాత్రాన.—

రాజ:- ఆపు ఈ విషయంలో నీకన్నా, పార్టీకే ఎక్కువ తెలుసు. క్రమశిక్షణలో మెలుగు కూర్చో, పార్టీ ప్రజా

చెప్పాలి సమాధానం. పార్టీకి దూరమౌతానంటావా?
ఆ బూతుసాహిత్య ప్రచారం మానుకుంటావా.

నిత్య: (పెదాలుకదిలాయి చేతులు వదిలి) ఆపు స్త్రాలుబూతులు కావనిమరోసారి చెపుతున్నాను, అవిమహోన్నతగ్రంథాలు. అవి మానవునికి స్వేచ్ఛను స్వంత ఆలోచన నివ్వగల రచనలు అవి ప్రపంచంలో మానవజాతి వున్నంతకాలం శాశ్వతంగా నిలచే గ్రంథాలు. కారణమేమంటే ప్రపంచంలో ఆకలిబాధ ఒకటేకాదు వుంది. ఎన్నో వందల బాధలున్నాయి. రేపు కమ్యూనిజమొచ్చినా అకలి బాధ పోయినా, ఆర్థికబాధ పోయినా, ఇంకా పోకుండా మిగిలి, మానవుల్ని పీడించే అనేక బాధలున్నాయి. అవన్నీ పోవాలంటేకనీసంపోయినట్లు భ్రమైనాకలిగించితృప్తిపరచాలంటే ఎవరికి ఏసమస్య దగ్గరగావుందో ఆ సమస్య వ్రాస్తుండాలి. అంతేకాని ఆకలి కవిత్వమొకటే కవిత్వమని అదేఅభ్యుదయ కవిత్వమని నిర్బంధంగా రాయించడం తక్కినదంతా చెత్త అని తప్పుడు ప్రచారంచేయుడం తప్పు. ఇంకొకటి మీ వాదనేమంటే ఈ సాహిత్యంలో పరిష్కారాలు లేవని- దీనికి నా సమాధానమేమంటే ప్రకృతి సహజత్వాన్ని అర్థంచేసుకోవడంలో పూర్తిగా అజ్ఞానులైన కమ్యూనిస్టులకు అసలే అర్థంకాదు. పరిష్కారాలు కథల్లో లేకపోవడాలుకాదు. అసలు కొన్ని మానవజీవితాలకే పరిష్కారాలులేవని కొన్ని మానవ సమస్యలకు పరిష్కారాలు ఆఖరి మజిలీఅయిన ఆ శ్మశానమందేనని ఈ శరీరం

ఆ కట్టెలపై కాలేటప్పుడే మానవునికున్న అన్ని సమస్యలు పరిష్కారమై పోతాయని అప్పటిదాకా పరిష్కారాలు చాలా కష్టమని ఈ ప్రపంచాన్ని మార్క్సుదగ్గర నేర్చుకున్న పాఠాలదృష్టితో చూసే కమ్యూనిస్టులమైన మనకు అర్థం కాదు. కమ్యూనిస్టులుగావుండి వెయ్యి జన్మలెత్తినా అర్థం చేసుకోలేరు. అర్థంకాదు. ఆ మార్క్సుమార్కు కళ్ళ జోడు తీసి ప్రపంచాన్ని అసలు మన సొంత కళ్ళతో చూస్తే తప్ప: కాబట్టి ఆఖరిమాటగానే చెప్పేది చెప్పు కునేది ఏమంటే, ఆకలి బాధ పోవాల్సిందే-అట్లాగే ప్రేమ బాధకూడా పోవాల్సిందేనని కాబట్టి ఇక ఎట్లాగైనామీకు అంటే కమ్యూనిస్టుపార్టీకి నాకూ కుదరదు. కాబట్టి-పార్టీకి దూరమే అవుతాను. అదే కాదు. మీరు అనేక సార్లన్నారు. నేను పార్టీనుంచి బయటకుపోతే నా బ్రతుకు కుక్కకన్నా హీనమై పోతుందని నాముఖమింకెవరూ చూడరని నా ఉపన్యాసాలెవరూ వినరని అంటే మీ ఉద్దేశ్యం ప్రతిష్టలు సంపాదించుకుందామనే ఆరాటంలో, గతం లో సంపాదించిన ప్రతిష్టలుపోతాయనే భయంతో ప్రజల్లోకి పోయి ఇంకా తప్పుడు ఉపన్యాసాలిస్తూ నా హృదయాన్ని చంపుకుని వాస్తవాన్ని మరుగుపరిచి ఇంకా ఈ పార్టీలోనే కుములుతూవుంటానని అనుకుంటున్నారు. కాని అది చాలాపొరపాటు గౌరవాలమీదా, పేరు ప్రతిష్టలమీదా ఏనాడో మోజుతప్పిపోయింది నాకు నాకక్కర్లేదవి వాటికోసం చాటున నానా గడ్డి కరవచలదలేదు.

అందరూ ఉమ్మేస్తారని పిరికిపందగా మారచదలచుకోలేదు, అందుకని పార్టీకి దూరమే అవుతానని మరోసారి చెపుతున్నాను.

రాజా:- ఆలోచించుకో, దూరమౌతానని ఒక్కమాటలో అనకు తప్పుచేయడం మానవ లక్షణం—దిద్దుకోవడం ఉత్తమలక్షణం.

నిత్య:- (కళ్ళల్లో నీళ్ళు గిరున తిరుగుతాయి కళ్ళు నిప్పులై పోతాయి. తీక్షణంగా చూస్తూ) దిద్దుకోడానికి నేచేసిన తప్పేమీ లేదని చెపుతున్నా నేనారచనలు సత్యమని నమ్మాను. పార్టీకోసం లేకపోతే మీకోసం మరెవరికోసమైనా సరే, వాటన్నిటినీ అసత్యాలు, అవినీతులు అని నన్ను నేను మోసం చేసుకోదలచ లేదు. అవన్నీ హృదయాల్ని కదిలించే ప్రేమల్ని పుట్టించే మోసాల్ని బయటపెట్టే రచనలు మృగాలైన మనుష్యుల్ని మళ్ళీ మానవుల్నిగా చేసే వ్రాతలు అతి వాస్తవాలు నే కాదనలేను-వాటిని

రాజా:- దేశమంతా అధోగతిలోవుండగా ఎందుకోయి ఈ ప్రేమరచనలు ఈ వ్యూహరచనలు ఎవరికోసం.

నిత్య:- అయితే దేశం అధోగతిలో ఉండగా దేశభక్తులు పెళ్ళిళ్లు ఎందుకు చేసుకున్నారు. మానుకోకపోయారా—

రాజ;- పెండ్లిండ్లకీ, ఈ అరాచకానికి సంబంధంలేదు. అందులో ఈ కవులు చెప్పే ప్రేమలు చాలా అరాచకమైనవి. మనం అనుసరించాల్సింది పవిత్రమైన ప్రేమ.

నిత్య:- అవును- అరాచకం. కల్లుపాకలో తాగితే అరాచకం. అదే తలుపులు బిగించుకుని పీకెలదాకా తాగి పక్కమీద పడి దొల్లుతుంటే రాచరికం!

రాజ:- (మండిపడుతూ) ఏయి నిత్యాబాబూ ఏమిటామాటలు- ఎవరు తలుపులు బిగించుకున్నారు.

నిత్య:- చెప్తా-అసలింకా మనం ఇతరోళ్లను విమర్శించడ మెందుకు, పూర్వం హిందూసంఘం-సంఘంలో జరిగే ఘోరాల్ని కప్పిపుచ్చుతున్నట్లే మన పార్టీకూడా కప్పివుంచి నీచాల్ని చేసే సూత్రం ప్రారంభించారన్నమాట.

రాజ:- ఏయి నిత్యాబాబు, ఏమిటి నీవిప్పు డన్నమాట పార్టీ వాళ్ళనుకూడా అంటున్నావేం (తన విషయం బయటపడిం దేమోనని గజగజ వణుకుతూ) మేమెటువంటి నీతిగల వాళ్ళమైందీ ప్రపంచానికి తెలుసు.

నిత్య:- ఆఁ తెలుసు. పార్టీవాళ్ళల్లోకూడా వున్నారు. నీచాలకు పాల్పడేవాళ్లు.

రాజ:- (తన గుండెదడ మరీ ఎక్కువైంది. వొళ్ళు చెమటలు పడుతున్నాయి. లలితా తన సంబంధం ఈ ముండాకొడుక్కి తెలిసిందేమో! "కొంపలారిపోతయ్యే ఇప్పుడెట్లా" అని ఒణుకుతున్నాడు. మాట్లాడటానికి మాటరావడం లేదు కాని నిత్య అనేదానికి సమాధానం చెప్పకపోతే కుదరదు ఎట్లా-ఏవరికెట్లాగైతేనేం గొంతు పెగల్చుకొని) పార్టీవాళ్ళా-నీచాలా-చాలాఁ తీవ్రమైంది నీ వ్యవహారం అనవసరంగా మాట్లాడుతున్నావు.

నిత్య:- అనవసరంగాకాదు. (మహా వుద్రేకంతో కంఠమెత్తి ఇల్లు అదిరేలా) వున్నారు - పార్టీలో వున్నారు—

గోపా:- (లేచి) ఎవరో బయటపెట్టండి.

నిత్య:- సుబ్బారావుగారిభార్య సుశీలగార్ని ఒక్కసారి లేచి నా పక్కకొచ్చి నిలబడమనండి.

సుబ్బారావు:- (లేచి) ఎందుకూ - నీ ప్రక్కన నా భార్య నుంచోడమెందుకూ ?

రాజా:- (తన గుండెదడ కనబడింది తన వ్యవహారం కా నందుకు)

నిత్య:- ఎందుకో చెప్తా రమ్మనండి.

ఒకపార్టీసభ్యుడు:- (లేచి సుశీలవైపు చూస్తూ) అసలేమిటో మా కర్థంకావడంలేదు. వెళ్ళి నుంచోండమ్మా.

సుబ్బా:- (మిరి మిరి చూస్తూ) అట్లా అంత నీచుడి ప్రక్కనా భార్య నుంచోడానికి వీల్లేదు.

నిత్య:- (కొంటెంగా) నీచుణ్ణి నేను కాదు నీభార్య.

సుబ్బా:- ఆఁ చూసారా రాజారావుగారు చూసారా క్రామే డ్స్-నా భార్యను ఎంత ఘోరంగా—

రాజారావు:- నిత్యబాబూ, నీకు తల తిరుగుతోంది.

నిత్య.- తల ఎప్పుడో తిరిగి పోయింది.

రాజ:- తల చితుకుతుంది—మహిళ అయిన ఆమెను పట్టుకొని.

నిత్య:- తల ఎప్పుడో చితికి, నలిగి కృశించి పోయింది—ఈపార్టీ యంత్రంలో పడి—ఇది పార్టీకాదు- ఇదొక పెద్దఫ్యాక్టరీ

దీంట్లో తయారయ్యేవన్నీ యంత్రాలే—మానవ రూప యంత్రాలు. నేను అలాగే తయారైయ్యాను. ఇక మాత్రం ఈ పార్టీ యంత్రాన్ని పడి నా స్వేచ్ఛను పిండిచేసుకో దలచ లేదు. నా మెదణ్ణి వర్తి ఎంత్రంలా పార్టీలో తిప్పదలచ లేదు. మళ్ళీ అంటున్నాను.—సుశీల వచ్చి నీచురాలని ఈ మహిళా సంఘనాయకురాలైన సుశీలకన్నా బోగంది చాలా ఉత్తమురాలు. గుడిశముందు నుంచుని బహిరంగంగా మొగాణ్ణి పిలిచే దొమ్మరిది నయం. మనం ఎంతో నీచం అనుకుంటున్న బోగంపిల్ల చాటుగా, నీచంగా చేయటంలేదు వ్యభిచారం, బహిరంగంగా, సంతోషంగా మొగాణ్ణి ఆహ్వానిస్తుంది. నిజంగా ధీరత్వమంటే అది, నిజాయితీగల స్త్రీ అంటె అది నీతి అంటే దానికే చెల్లుతుంది. కాని నిద్ర పోతున్న పరాయి పురుషుణ్ణి ఇష్టమొచ్చినట్లు ముద్దు పెట్టుకోడం.

సుబ్బా:- (మండిపడుతూ) ముద్దు—ఎవర్ని, ఎవరు పెట్టుకున్నారు. ఏమిటీ అసహ్యపు కూతలన్నీ.

నిత్య:- అవును నా కూతలేగాని అసహ్యం. చేతలు కావు. కాని నీ భార్య—మహా నాయకురాలు మహిళా సంఘాల ప్లాట్‌ఫారాల మీద ఉత్తమమైన నీతులతో మిళితమైన గొప్ప పదాలతో మహోపన్యాసాలిచ్చే సుశీలగారి కూతలు మంచివే-భావాలు మంచివే-చేతలే తుచ్ఛపువి. (సభ్యుల్లో కొందరికి ఇదంతా అర్థంకాక చూస్తున్నారు. కొందరు ఆశ్చర్య పడుతున్నారు.)

కొండయ్య:- సుశీలగారూ-సుంచోండి.

రాజా:- సుంచోండి సుశీలగారూ

సుశీల:- (సుంచుంటుంది?)

నిత్య:- సుశీలగారూ, మీరు, నేను పడుకొనివుండగా నాగది లోకి వచ్చి - మీయిష్టమొచ్చినట్లు మీ పెదాలతో నన్నూ, నా బుగ్గల్ని ముద్దుపెట్టుకోలేదూ—

సుశీల:- ముద్దా-నిన్నా-నేనా-నీచుడా. అమ్మో ఎంతఘోరం. పార్టీమీదపగ నాపైపెట్టి తీర్చుకుందామను కున్నావా నీచుడా నా భర్త సుబ్బారావుగారు మొదటినుంచి నిన్ను వ్యతిరేకిస్తున్నాడని ఆయనపై పగ పార్టీమీద పగ ఇట్లా నామీదపెట్టి తీర్చుకుందామనుకున్నావా తుచ్ఛుడా తప్పు అబద్ధమాడుతావా నిజంగా నీకే పౌరుషముంటే మైదానం మీద శౌర్యంగా పోట్లాడు. అంతేకాని ఒక సంఘానికి నాయకురాలై ఒక పవిత్రజీవితం సాగిస్తున్న నాలాంటిదాని పైనా నిందవేయడం.

సుబ్బా:- చూసారా కామ్రేడ్స్, చూసారా రాజారావుగారూ- నన్నూ-నాభార్యను, నా పరువు- మీఅందరిముందూ చూసారా కామ్రేడ్స్-చిన్నారావు రాజారావుగారూ-ఇప్పటికైనా గ్రహించారా వీడి బ్రతుకెంత నీచంగా మారిపోయిందో నీచుడు ఎంత ఘోరానికైనా ఒడిగడతాడు.

నిత్య:- సుబ్బారావుగారూ, మర్యాదతప్పి మాట్లాడుతున్నారు నేనుకాదు నీచుణ్ణి మరోసారిచెప్పుతున్నాను. వాస్తవాన్ని

కప్పిపుచ్చేవాళ్ళు నీచులు, వాస్తవాన్ని నమ్మలేనివాళ్ళు నీచులు, దొంగలు, కపటులు.

గోపా:- (లేచి నిత్యబాబు దగ్గరకొచ్చి) సిగ్గులేదూ అంత నాయకురాల్ని పట్టుకొని—

రంగా:- అరెరె ఎంత ఘోరమయి పోయ్యావ్ - నువ్వేంటో న్యాయస్థుడవూ మంచివాడవూ అనుకున్నానేను. ఛీ-ఛీ-

నిత్యా.- నీకు తెలియదు రంగా - ముమ్మాటికి నిజంగా నా వొళ్ళంతా ముద్దు-

రాజ:- ఆపు - నీ వాగుడి కంతయ్యె రోజొచ్చింది.

సుబ్బా:- కట్టేసి తన్నాలి - వత్తిగా వదిలిపెడితే లాభం లేదు వీణ్ణి. రాజారావుగారూ మాట్లాడరేమండీ.

రాజ:- అవును కట్టేసి వెనుక తిరగ్గొట్టాలి, రుజువు చేస్తావా సాక్ష్యముందా.

నిత్యా:- రుజువు-సాక్ష్యం-సుశీలగారూ- నేనే. కాని ముద్దాయిలు మాత్రం మేమిద్దరమూ కాదు. ఎవరంటే- కామం ప్రేమ-మోహం. కాని ఈ కోర్టు విచారణలో సాక్షి భయపడింది. అబద్ధమాడేసింది. కాని మార్క్సిస్టులై మహామేధావులనుకుంటున్న మీకు కూడా సాక్ష్యమే కావాలన్నమాట [illegible] నగ్నసత్యాలను అంగీకరించే తాహతులేదన్నమాట. అసలు లోకంలో కొన్ని విషయాలకు రుజువులుచేసే అవకాశం, సాక్ష్యాలు తెచ్చే అవకాశం వుండదన్నసంగతి ఇంత మేధావులైన కమ్యూనిస్టులకు తెలియకపోవడం చాలా ఆశ్చర్యకరం ఎట్లాగంటే

గాలి ఎవరికీ కనపడదు. వాసన ఫలానారూపంలో కన పడదు. కానీ ఆవి రెండూ వున్న సంగతి అందరికీ తెలుసు కాని సాక్ష్యాలు కావాలంటే కుదరదు. ఎవరికి వాళ్ళ కర్థ మౌతుంది. సర్వసామాన్యమైన రుజువు కందని నగ్న సత్యాలు కొన్ని ప్రపంచంలో వున్న వన్న సంగతి గ్రహించాలి. నా స్తనంగా సుశీలగారు ముద్దుపెట్టుకుంది.

సభ్యుల్లో కొందరు:- ముందుకట్టేయండి చూస్తారేం త్రాలా ఒకటి పుచ్చుకోక.

రాజ:- సంతోషం. కామ్రేడ్స్ ఇప్పటికైనా వీడి అసలురంగు తెలుసు కున్నందుకు, మహాసంతోషం. అవును వీణ్ణి కట్టేయడమేకాదు వీడి శరీరాన్ని బద్దలుగా రెండుగా చీల్చినా పాపంలేదు. ఇద్దరు కామ్రేడ్స్ లేచి తాళ్ళూ, ఒక బెత్తం కూడా తీసుకురాండి.

సుబ్బా:- ఆమూల గదిలో వుంది పెద్దతాడు అక్కడే కొరడా కూడా వుంది. నువ్వుపోయి పట్టుకు రా గోపాత్రావు.

గో:- (లోపలికెళతాడు)

సుబ్బా:- వీడివల్ల ఆత్మవాణి కూడా పిచ్చెత్తి పోయింది. తల్లిదండ్రులతో పేచీ పెట్టుకుంది మనతో కూడా పోట్లాడుతూ వుంది.

రాజ:- అవును మనతో కూడా పోట్లాడుతున్నది ఆయూత్ లీగ్ శక్రటరీని చేసుకోవడానికా క్రేడ్స్ చూసారా ఆసత్యవాణి నిర్ణయమైన పెండ్లిని వీడుచెడగొట్టడానికి ప్రయత్నిస్తు న్నాడు, పిలుచుకురాండి-ఆసత్యవాణిని కూడా ఆపిల్లకు

యిప్పుడన్నా చెపుదాం బుద్ధి పీడెంత నీచుడో చూపిద్దాం అప్పటికైన మనసు మార్చుకుంటుందేమో-కామ్రేడ్ నారాయణా, నువ్వెళ్ళి సత్యవాణిని వెంటనే వెంట పెట్టుకురా.

నారా:- (లేచి వెళతాడు.)

[తాళ్ళు తెచ్చి నిత్య బాబుచేతుల్ని ఒరగకడతారు.]

ఒకసభ్యుడు:- (సత్యాబాబు మీద వుమ్మేసి) ఛీ నీబతుకు తగలెయ్య.

నిత్య:- కామ్రేడ్ నీకు తెలియదు వుమ్మేయకు నా మీద.

రాజ:- ఉమ్మేయడం కాదు, ఏం పోసినా పాపంలేదు. ఒక పవిత్రమైన మహిళను పట్టుకుని-నీకు నోరెట్లా వచ్చిందిరా. (లాగి చెంప మీద కొడతాడు. కొట్టి తనూ కాండ్రించి వుమ్మేస్తాడు.)

రంగా:- పార్టీ ఈ వేళనిచ్చు బయటకు వెళ్లగొడుతున్నదని పార్టీని అపకీర్తిపాలు చేయడంకోసం ఆమెని అన్యాయంగా

నిత్య:- అన్యాయంకాదు-నె చెప్పేది నిజంరంగా నువుకూడా నమ్మవారంగా నన్ను.

సుబ్బా:- మూస్తారేం చర్మం వూడేటట్లు కొట్టండి.

గోపా:- (బలంకొద్దీ కొరడాతో నిత్యబాబు వీపుమీదకు విసురుతాడు కొరడాను.)

నిత్య:- (దెబ్బకు "అమ్మో" అంటాడు.)

గో:- (ఇంకో దెబ్బ కొడతాడు)

నిత్య:- (అబ్బా - బాధతో) ఏం సుశీలా నువ్వు వొచ్చి అదే పనిగా మీద పడుతుంటే ఏమన్నాను. ముందు నీభర్తకు విడాకులిచ్చి రమ్మనలేదు.

రాజ:-విన్నారా కామ్రేడ్స్. విడాకులిచ్చి రమ్మన్నాట్ట తుచ్ఛుడు. ప్రాణంకూడా తీసి రమ్మంటాడు. (పది, గోపాల్రావ్ ఆ కొరడా పది తీసుకుని) ఏం రా, విడాకులిచ్చి రమ్మన్నావా - ఇదిగో ఇస్తున్నా (బలంకొద్ది ఒసురుతాడు నిత్యాబాబు వీపుమీదకు, కొరడాను వొంటిమీద దెబ్బ పడుతుంది. ఒళ్ళంతా విరిగిపోయే బాధ పడుతుంటాడు)

నిత్య:- బాధపడుతూ సుశీలవైపు చూస్తూ సుశీలా, నన్నిట్లా కట్టి కొట్టిస్తూ చూస్తూ నుంచున్నావా? నీకు నిజంగా స్త్రీ హృదయముందా? ఆనాడు నీవు స్త్రీ రూపంలో నేకదూ నాదగ్గరకొచ్చింది స్త్రీ హృదయంతో నేకదూ, నాతో మాట్లాడింది? నేనే నీకు కావాలన్నది నాపై నీకు గొప్ప ప్రేమ వున్నదన్నది. నేనే స్వర్గమన్నావే-! ఈనాడు రాక్షసిగా మారిపోయావా-! సుశీలా, నీది న్యాయమేనా- వొద్దంటున్నా భర్తచాటు భార్య పరాయివాడితో సరసం చేయడం, చాటుగా పరాయివాడి శరీరం కావాలనడం, తప్పని, మోసమని మొత్తుకున్నా నీముద్దులతో నా ఒళ్ళంతా తడిపేశావే అట్లా నీముద్దులతో ఈ శరీరాన్ని తడిపిన నీవే ఈనాడు దెబ్బలతో రక్తంతో తడిపేయిస్తావా ఒక్కక్షణంలో జరిగినదంతా అబద్ధమనడానికి నీనోరెట్లా ఆడింది కాని సుశీలా నీతో ఒక్కటి చెప్పదలచుకున్నా, దీంట్లో

అబద్ధమాడాల్సినంత ప్రమాదమేమీలేదు. అయినా నువ్వు నాదగ్గర కట్టాలనడం తప్పనడం లేదు. కాని అబద్ధమాడటమే తప్పు. నువ్వేమిటి, నేనైనా అంతే చేస్తాను. కామం, ప్రేమ, మోహం మనలో ప్రవేశించేదాకా కానేగాని, ప్రవేశించిన తరువాత దాన్ని ఆపడం మనతరం కాదు. ఏవిధానైనాసరే తీర్చుకో బుద్ధి పుడుతుంది. కామం, ప్రేమ మోహం మన వొంటినిండాను వచ్చేసిందంటే మన వళ్ళు మన స్వాధీనం తప్పిపోతుంది. ఆసమయంలో మనకళ్ళ ముందు ఏం కనపడితే దాంతోనే వాంఛ తీర్చుకోవాలన్నంత ఆవేశం పెరుగుతుంది. తీర్చుకోక తప్పుకూడా తీర్చుకోడం తప్పుకాదు కూడా. స్త్రీతో స్త్రీయే పురుషుడితో పురుషుడే తీర్చుకోడం కూడా జరుగుతుంది అది తప్పా ఒప్పా అంటేనే చెప్పలేను. ఎవరిష్టం వారిది. కాని ఎవరూ బయటికి ఒప్పుకోరు ఈ విషయాలు తప్పంటారంతా. నేను కాదంటా. అట్లానే ఒక స్త్రీ ఒక పురుషుడూ కూడా ఒకర్ని ఒకరు, కామంవల్లో ప్రేమ వల్లో, మోహం వల్లో గాఢంగా వాంఛిస్తారు. ఆ వాంఛించడం, తీర్చుకోడం తప్పులేదంటాను నేను. కాని తప్పంటున్నారు. అట్లా తప్పనడమే తప్పంటాను నేను, పోనీ తప్పని మానుతున్నారా- లేదు. చాటుగా చేస్తూనే వున్నారు. ఇవి నగ్న సత్యాలు. వీటిని ఒప్పుకున్నందువల్ల వచ్చే నీచత్వమేమి లేదు. కాని నీచత్వం వస్తుందని, గౌరవ ప్రతిష్టలు పోతాయని భయపడి దాస్తున్నారు. ఆ దాయడమే తప్పంటాను

ఆనందంగా అంగీకరించాలంటాను. ఇప్పటికైనా ఒప్పుకుంటావా సుశీలా నన్ను క్షమిస్తు—

సుశీల మాట్లాడాలన్నింకా ప్రయత్నపు గాలుచేయాలని చూస్తున్నాడు. మూర్ఛగును.

రాజారావు:— (బాగి కొరడాతో కొట్టి) నీకింకా ఒళ్లు పొగరు తగ్గలా—

నిత్య:— పోన్లే సుశీలా—నీ ప్రతిష్ఠకోసం, నీ మహిళా సంఘ మహానాయకత్వానికి భంగం వస్తుందని, నలుగురూ "ఛీ" అంటారని అబద్ధమాడుతున్నావు, తప్పులేదు. నేనే అన్ని నీచాలు, అపకీర్తులూ భరిస్తాను. కానీ నాముందునుంచి తప్పుకో కనపడకుండా పో మహాతల్లీ అంత ప్రేమపై ఉపన్యాసమిచ్చిన స్త్రీ, ఇంత కఠినంగా, ఇంత అబద్ధంగా ప్రవర్తిస్తుందని, ఇతర కళంకం లేని ప్రేమల్ని కూడా శంకించే బలహీనత ఏర్పడుతుందేమో నాలో.

ఇంకా నీరూపం నాకళ్ళముందు కనపడుతుంటే.

సుబ్బా:— మళ్ళీ మొదలుపెట్టావు. తన్నండి, బాదండి చర్మం వూడిపోవాలి ఈ వేళ పీడది. (దెబ్బలపైన దెబ్బలు కొరడాతోనూ, చేతులతోనూ బాదుతూవుంటారు.)

నిత్య:— బాదండి - చచ్చేదాకా బాదండి. చాలా హాయిగా వుంది నాకు, మీఅందరిలోనూ నేనూ ఒక నాయకుణ్ణాఅనిపించుకుంటూ నా స్వేచ్ఛను అరికట్టుకొని, నీచాలు చేస్తూ, దానినుంచి వుత్పన్నమయ్యే, అంతరాత్మనుంచి ఘోష పెట్టే మానసిక బాధ భరించడం మహాకష్టం మురికి

లో వెయ్యేళ్ళు బ్రతికేకన్నా స్వేచ్ఛగా ఆనందంగా ఒక్క-క్షణం శ్వాస పీల్చి ప్రాణం వదలడం హాయి. ఆనందం ఇంతకన్నా భాగ్యం ప్రపంచంలో మరేముంటుంది. ఆభాగ్యం దొరకడం మహా అదృష్టంకదూ! నాకండరు నరికి ఆ మాంసం నంజుకుతింటండి అది చూస్తూ వారి సంతోషపడతాను. అనాగరికులంటే, అడవిమృగాలంటే పచ్చిమాంసం తినే ఆదిమ జాతి వాళ్ళంటే ఎట్లా వుంటారో, ఏంచేస్తారో వాళ్ళ సంగతేమిటో తెలుసుకోవాలని వుంటుంది. అవి తెలుసుకోవాలంటే మహాశ్రమచేసి చరిత్రలన్నీ చదవాలి. కాని మిమ్మల్ని మీ పనులను ఒక్క-క్షణం చూస్తేచాలు వాళ్ళ చరిత్రఅంతా సొంతం కళ్లకు కట్టిపోతుంది. "వీరేనా నాగరికులు సంఘాన్ని వుద్ధరించేవాళ్ళు వీళ్ళేనా అనిపిస్తుంది.

సుశీల:- (నిత్యబాబు పడే బాధను కళ్ళారా చూచి కళ్ళ నీరు పెట్టుకుంది. చెయ్యెత్తి) కొట్టకండి, ఆయన్ని బాధపెట్టకండి నిజమే ముద్దుపెట్టుకున్నమాట నిజమే, అవును. బాబు వాళ్ళంతా ముద్దుపెట్టుకున్నమాటనిజమేవదలండి-ఆయన్ని వదిలేయండి ఆ అబ్బాయి పసిదాన నిజంగా అతను వేసింది నిందకాదు. ఆ అబ్బాయి చెప్పింది వాస్తవమేవదిలేయండి.

సుబ్బా:- (సుశీలవైపు తిరిగి మండిపడుతూ) పరువంతాతీసావు-నీకేమన్నా పిచ్చెక్కిందా ముద్దు పెట్టుకున్నానంటావు నీ నోటితో నువ్వే.

రాజ:- లేదు సుబ్బారావుగారూ, ఆమె వాస్తవంగా స్త్రీ కనుక స్త్రీ బలహీనత చూపింది. అతన్ని కొడుతున్నామని అతని

బాధను చూసి జాలి కలిగి అనివృండవచ్చు. స్త్రీలకు మాతృహృదయం ఎక్కువ. అందుకే ఆమెకు నిత్యాబాబు అంత దుర్మార్గుడైనప్పటికి జాలి కలిగింది కాని సుశీలగారు ఇంత నీచుడిమీద మీకు జాలి పనికిరాదు. వాడు తుచ్ఛుడు. [సభ్యులు ఒక్కసారి గల్లంతుగా] వాడు తుచ్ఛుడే. నిజంగా, సుశీలగారు వాడిమీద మీకు జాలి పనికిరాదు.

నిత్యా:- (సుశీలతో) సమయం తప్పి, సత్యం మాట్లాడినా ఫలితముండదు సుశీలగారూ. ఆకలి పుట్టినప్పుడే అన్నం తెచ్చి పెట్టాలి కడుపు నిండింతరువాత పంచభక్ష్య పరమాన్నం తెచ్చినా ఎక్కదు. పైగా దోకొస్తుంది. అట్లాగే మనిషి చని పోయింతరువాత డాక్టరును తీసుకొస్తే ప్రయోజనం లేదు. ఆజాగ్రత్తలన్నీ ప్రాణముండగానే పడాలి. ఒక వ్యక్తికి డబ్బుతో ప్రాణావసర మొచ్చిందనుకోండి అప్పుడా వ్యక్తికి అది దొరకక పిచ్చివాడై పోయాడను కుందాం. అప్పుడు నువ్వొక లక్షరూపాయలు తీసుకు వెళ్ళి తీసుకో మన్నా అక్కర్లేదంటాడు. అసమయం తప్పింది ఇప్పుడు డబ్బున్నా పనికారాటాడు. అదేకాదు పిచ్చివాడుగా మారి పోవడంవల్ల ఆనోట్ల విలువకూడా మరచిపోయి చించేస్తాడు అట్లాగే ఒక వెయ్యి రూపాయల వస్తువు వేలంపాడుతున్నా రనుకోండి. 100 రూపాయలకే కొట్టేసేట్టుగా వున్నారు. నువ్వు వెంటనే 105 అనాలి. అనకుండా సందేహిస్తు కూర్చుని 100కే పాట కొట్టేసింతరువాత 400 లిస్తా

నన్నా లాభం లేదు. కాబట్టి సుశీలగారు మీరు 'అవసరమై నప్పుడు అబద్ధమాడారు. అంతా అయి పోయింతరువాత నిజం ఒప్పుకుంటున్నారు. కాని ఎవరూ నమ్మరు. మీనిజం బూడిదలో పోసిన పన్నీరే—అసలు మనిషి చచ్చినతరువాత లాటరిలో లక్ష రూపాయలు వచ్చినట్టే.

[నారాయణ, వెంట సత్యవాణీ ప్రవేశం]

రాజ:- (సత్యవాణితో) ఇదిగో సత్యవాణీ నీవు ప్రేమించానన్న, నీవు గొప్పగా ఎంచుకుంటూ, వివాహం కూడా చేసుకుంటానన్న నిత్యబాబు. ఇదుగో నీచుడు. సుశీలగారి మీద వేయరాని నింద వేశాడు.

పార్టీ సభ్యులు:- (ఛీ-తూ-అని ఉమ్మేస్తుంటారు)

రాజ:- (నిత్యబాబు నెపు తిరిగి) నీచుడా సత్యవాణిని కూడా పిచ్చికించావు కదూ కాబోయే పెండ్లి చెడగొట్టావుకదూ (తూ! అని ఉమ్మేసి చెంపమీద దెబ్బకొడతాడు)

సత్య:- వారి నెందుకండీ అన్యాయంగా కొడతారు. వారిమీద ఉమ్మేయడానికి, వా రేమీ నీచులుకారు. వారు నాకేమీ పిచ్చికించ లేదు. నేనే వారిని పెండ్లిచేసుకుంటానన్నాను. రాజారావుగారు ఒకప్పుడు మీరుకూడా ఒప్పుకున్నారు. పార్టీ అంతా ఆమోదించింది. మేమిద్దరం పెళ్ళి చేసుకోడానికి అట్లాటిదే—

రాజ:—అది నిజమేకాని, ఆకోటీశ్వరునిపాయమ్యాలు నిత్యబాబు మారిపోయాడు. చెడిపోయాడు. పార్టీ వ్యతిరేకిగా తయారయ్యాడు. ఇట్లాంటి నీచుణ్ణి పార్టీవ్యతిరేకిని చేసుకుంటావా?

సత్యవాణి:- అవును చేసుకుంటాను. పార్టీకి వ్యతిరేకి అవుతే, నాకు వ్యతిరేకులుకారు. నా కిష్టమైంది. అంతే కాని నా కిష్టంలేని పెండ్లి చేయడానికి మీకెవరికీ అధికారంలేదు. హింసూపుత్తాన్ని అంటారే, మరి మీరెట్లా చెస్తారు ఇష్టంలేని పెండ్లి నిర్బంధంగా. వీల్లేదు-(పేరుమధ్య పురుగుల్లా చేరి మా ఇద్దరినీ విడతీస్తారా వీల్లేదు.

రాజ:- వీల్లేదనడానికి వీల్లేదు. నీకోసంకోసం పార్టీ గౌరవం కోసం చెపుతున్నాం. ఇతన్ని చేసుకుంటే కుక్క-కన్నా హీనమైపోతుంది బ్రతుకు.

సత్యవాణి:- హీనమైనాసరే ఆయనే కావాలి. అంత మీకు కష్టంగావుంటే, నేనూ పార్టీనుంచి బయటకుపోతా.

రాజా:- పార్టీనుంచి బయటకు పోవడానికికూడా నీ కదికారం లేదు.

నిత్య:- (సత్యవాణితో) సత్యవాణీ పూర్వమేదో అనుకున్నాం కాలం మారిందని కొత్తయుగమొచ్చిందని మనుష్యులంతా నాగరికులౌతున్నారని-కాని అంతా అబద్దం. కాలంమారలేదు. కొత్తయుగ మేమీకాదు. నాగరికులంతకన్నా కాదు. అంత మామూలే-పేర్లే మార్పు.

రాజ:-కామ్రేడ్స్ లాభంలేదు. ఇంకా ఎక్కువైంది వీడి ధోరణి సత్యవాణి వీణ్ణితప్ప ఎవర్నీ చేసుకోదట. చూద్దాం వీణ్ణి కొంచెం లో పలికి తీసుకువెళ్ళి శవంగా మార్చి పట్టుకు రాండి ప్పుడు చేసుకుంటుంది సత్యవాణి. అప్పుడువీళ్ళిద్దరి పెళ్ళి మనమే చేద్దాం.

సత:-ఆఁ ఏమిటా మాటలు అనరాని మాటలు (బావురుమంటుంది.
రాజ:- వీణ్ణి లోపలికి తీసుకుపోండి సహించడానికి వీల్లేదు)
వాళ్ళంతా ఎర్రటికడ్డీలు పెట్టి కాల్చండి మృదగబ్బల్ని,
తేళ్ళనీ శరీరంమీదకు వదలండి [పార్టీ సభ్యులు, సత్యబాబుని
జరజరా లోపలికి ఈడ్చుకుపోతారు]
సత్య:- (దెబ్బలు వినపడుతుంటాయి. ఏడుస్తూ) కొట్టకండి,నా
బాబును, ఇట్లా హింసపెట్టడం న్యాయంకాదు.
[తెర వెనుకనుంచి – పద్యం వినపడుతూవుంటుంది.]

పద్యం.

వాస్తవస్థితి చూడగల నీకన్ను
కాలము మారలేదన్న – సంఘము మారబోదన్న
కాల్చి వేసెను – నీ కన్నుల నిండు నిప్పులతో
గతమందు – సూర్యుడుకాదు తిరుగు చున్నది.
ఈ భూమి యన్న, మానవోత్తముని
వాస్తవ స్థితి తెల్పిన, మానవోత్తముని
కుత్సిత, కత్తికి బలియాయ లేదే
అది ఈ తుచ్ఛ సంఘమే కాదే—

సత్య:- చేయకండి నాబాబు బంగారపు శరీరాన్ని కాల్చకండి
బాబూ రాజారావుగారూ, మీకాళ్ళు పట్టుకుంటాను
పోనీ నన్ను కాల్చండి, రంపంతో నన్ను కోయండి-దీని
కంతా కారణం నేను.
రాజా:- వీల్లేదు, ఇది పవిత్ర పార్టీ వ్యవహారం. వ్యక్తుల వ్యవ
హారంకాదు దయా దాక్షిణ్యాలు చూపడానికి—

సత్యా:- (లోపల్నుంచి దెబ్బలమోతా-నిత్యబాబు బాధతో వేసే కేకలు వినవస్తుంటాయి.) రాజారావుగారూ, యమ ధర్మరాజుకన్నా ఘోరమై పోతున్నారా-అదుగో, నా బాబుపింకి మీదకు తేళ్ళు ఎక్కించడానికి సిద్ధంగా వున్నారు. చెప్పండి, వొద్దని చెప్పండి వదలమని చెప్పండి (విపరీతంగా అరుస్తుంది)

రాజ.- వీల్లేదు ఒక షరతుమీదైతే. వదలడానికి వీలుంది. నువ్వాయూనాత్ లేస్ శకర్లుటరీని చేసుకుంటే టర్లైతే-

సత్యా:- ఇష్టంలేని పెండ్లి కమ్యూనిస్టుపార్టీ కూడా చేస్తుందన్న మాట.

రాజ:- చేసుకోకపోతే అశుభ విస్తావ్.

[లోపల్నుంచి సభ్యులు] ఇక తేళ్ళూ, మండ్రగబ్బలు పాకించ మంటారా-

సత్యా:- (ఒక్కసారి భయంతో కెవ్వున కేకేస్తుంది)

రాజ:- ఆఁ పాకిం-

నిత్యా:- (రాజారావు మాట్లాడే నోటిని, తన చేత్తో మూసి.) అమ్మో, వద్దు కరిపించకండి, వదలండి' నాబాబు శరీరాన్ని (పిచ్చెత్తి పోయిన గొంతుతో. తలంతా పీక్కుంటూ) రాజారావుగారూ మీ యిష్టమొచ్చిన వాణ్ణి తీసుకురాండి పార్టీ మెంబర్నే కాదు. ఆఖరి జంతువునైనాసరే తీసుకు రాండి. చేసుకుంటాను. కుష్టువాణ్ణి తీసుకురాండి, చేసు

కుంటాను, రేపు చచ్చేవాడినైనాసరే పట్టుకురాండి చేసు కుంటాను, కానీ ఆయన్నిమాత్రం వదిలేయండి మీకు వెయ్యి నమస్కారాలుచేస్తా వదలండి-బాబూ నా నిత్య బాబును వదలండి-

రాజా:- అయితే వదిలేయండి-ఆ తుచ్ఛుణ్ణి మళ్ళీకనపడకుండా పొమ్మనండి. గెంటేయండి బయటికి. [కొద్ది క్షణాల తరు వాత, నిత్యబాబును వదిలిపెడతారు. నిత్యబాబు తూలి పోతూ బయటకు పోతుంటాడు. పార్టీసభ్యులు, నడిచే సత్తువకూడా లేని నిత్యబాబును మోసుకుంటూ బయటకు నడతారు.]

సత్య:- (నిత్యబాబు పిచ్చి అవతారాన్నిచూసి ఒక్కసారి సత్య వాణి కెవ్వుమంటుంది. క్రింద పడిపోతుంది.

తెర



(10)

# త్రిమిద వరంగము

[జనార్ధనరావు, యిల్లు-జనార్దనరావూ-రాజారావూ, కుర్చీలల్లో కూర్చుని ఉప్మా తింటూవుంటారు.]

జనా:- లలితా - మంచినీళ్లు పెట్టలేదేం...?

లలిత:- (లోపల్నించే) తెస్తున్నానండి- మరచిపొయ్యాను. కాఫీ వడబోస్తున్నా!

జనా:- లలితా, పూరీకూడాచేస్తే ఎంత బాగుండేది.

లలిత.- (వచ్చి) పోనీ యిప్పుడు చేస్తానేం.

రాజా:- ఎందుకు రా యిప్పుడు ఆమెకు శ్రమ.

జనా:- లలితా, మంచినీళ్లు పట్టుకురా. ముందు ఒరేయి రాజా రావు-మా, లలిత అలా శ్రమనుకునేది కాదురా - నా కోసం పాపం ఎంతశ్రమైనా పడుతుంది.

రాజా:- అయినా, త్వరగా పోవాలిరా పనివుంది పార్టీసభ్యులతో మాట్లాడాలి.

జనా:-సరే లలితా వాడికి తొందర పనివుందట కానీ సాయంత్రం పాత్రం ఎన్నో పిండివంటలు చేస్తుంది లలిత, సేమ్యా పూరీ, హల్వా సాయంత్రం ఎంతపనున్నాగురే, నాలుగింటి కల్లా వచ్చెయ్యాలి టిఫిన్ చేసేసి, లలితా నువ్వూ, నేనూ ముగ్గురం కలిసి జట్కా చేసుకుని పిక్చరుకు పోదాం - మంచినీళ్ళు, లలితా

లలిత:-(వస్తున్నానండి మంచినీళ్ళ గ్లాసులు తెచ్చి చెరొకటి పెడుతుంది. మళ్ళీ లోపలికి వెళ్ళి కప్పుల్లో కాఫీ తెచ్చి ఇద్దరికి చెరొకటి పెడుతుంది)

జనా:- (ముందు మంచినీళ్ళు తాగుతాడు).

రాజా:-(మంచినీళ్లు తాగుతాడు.)

జనా:- (కాఫీకప్పు రాజా కందిస్తూ) తీసుకోరా.

రాజా:-(తీసుకొని నోటిదగ్గర పెట్టుకుంటాడు.)

జనా:- (కాఫీ తాగుతూ) మూ, లలిత కాఫీ చేస్తే చాలాబాగుంటుందిరా.

రాజా:-(గుటకేసి) అవును బాగుంది.

జనా:-(తాగేస్తాడు కొద్దికాలం తరువాత, మెల్లగా కడుపు పట్టుకొని) అబ్బ ఏమిటి కడుపు తిప్పుతోంది.

లలిత:- ఆఁ ఏంటండి - కడుపు తిప్పుతుందా.

జనా:- అమ్మా కళ్లుకూడా తిరుగుతున్నాయి లలిత -ఏయి లలితా-రాజా నావు ఏమిటోయి ఇంది.

రాజ:- (దగ్గరకుపోయి తలపట్టుకుని) ఏమిట్రా యింతలోనే-

లలిత:- ఏమిటండీ, అట్లా అయిపోతున్నారు

రాజ:- ఏమిటి ఇంత సడన్‌గా డాక్టర్ని పిలుచుకొస్తాను.

లలిత:- పిలుచుకురాండి. నాకు భయమేస్తున్నది.

జనా:- (ప్రాణం తప్పి పడిపోతూ - నీరసమైన కంఠంతో - తేలి పోతున్న చూపులతో) డాక్టరు వొద్దు - అయిపోయింది. (కాసేపు వుక్కిరిబిక్కిరియై ఆఖరి శ్వాస లిస్తూ దుకుర్చిలో పడిపోతాడు)

రాజా:- లలితా-అయిపోయింది అయిపోయాడు. (నాడిచూసి) ఊ, ఖాయమే ఒక్క-క్షణంలో లేచిపోయింది ప్రాణం.

లలిత:- నాకేమో భయంగావుందండి.

రాజా:- భయం-ఎందుకని-ఏమీ లేదు. ఒంటిమీద ఒక గుడ్డ కప్పెయి. కంగారుపడకు. కానీ నిశ్శబ్దంగా వుంటావేం, ఏడవాలి గట్టిగా-భర్త చచ్చిపోతే ఏడవొద్దూ అంతా ఒచ్చి చూస్తారు నువ్వు గట్టిగా ఏడవాలి.

లలిత:- (చాలా పెద్దగొంతుతో ఏడుపు ప్రారంభిస్తుంది) అమ్మో అమ్మో!

రాజ:- ఆగు, అప్పుడే కాదు. కాసేపాగు. నే పోనీ.

లలిత:- (ఆపి) మీరు పోతారా, ఇంత భయంకరంగా చేసేసి.

రాజ:- అవును నే; వుండకూడదు. అనుమానపడతారు, ఇద్దర్నీ జైల్లో వేస్తారు. నే వెళ్ళిపోయింతరువాత గట్టిగా ఏడువు. అంతా వస్తారు. వాళ్ళూ కాసేపు ఏడుస్తారు. తరువాత మీవాళ్ళకు టెలిగ్రాంములు ఇస్తారు. వాళ్ళూ వస్తారు వాళ్ళూ కాసేపు ఏడుస్తారు తరువాత స్మశానానికి పంపివేస్తారు నీ భర్తను గొప్ప బ్యాండుమేళంతో వెంటనే

మీ వూరు వెళ్ళిపో. కొన్ని నెలల తరువాత ఏదో పార్టీ పని పేరుతో మీవూరు వస్తాను. మీ అమ్మా, వాళ్ళకు నచ్చ చెపుతాను. అప్పుడు మన మిద్దరం బ్రహ్మాండంగా విధవా వివాహం చేసుకుందాం. [ఇంతలోనే బయటనుంచి కేక-] అయ్యగారూ-అయ్యగారూ.

రాజ:- ఎవరో వచ్చారు నే పోతాను దొడ్డిదారిన అ ఉప్మా ప్లేటులు-కాఫీ కప్పులు తీసెయి.

లలిత:- రాజా మరి డాక్టరువచ్చి మందు ఇక్కించి బ్రతికిస్తాడేమో.—

రాజా:- అట్లాంటిభయం నీకేమక్కర్లేదు. డాక్టరు కాదు, వాడి బాబొచ్చినా, బ్రతికించలేడు మళ్లీ అట్లాంటివిషం అది ఊc నే పోతున్నా-(పోతాడు.)

లలిత:- (ఆ ప్లేట్లు అన్నీ తీసేస్తుంది.) [మళ్ళీ బయటనుంచి కేక అయ్యగారూఅయ్యగారూ-కలక్టరుగారొచ్చిపొమ్మన్నారు]

లలిత:- కలక్టరాఫీసు జవానులాగుంది (పెద్దగా ఏడుస్తూ పో... తలుపుతీస్తుంది. జవాను, లలిత ప్రవేశం)

లలిత:- (శవంమీదపడి గొల్లున గుండెబాదుకుంటూ ఏడుస్తూ) కుర్చీలో పడుకున్న వారు పడుకున్నట్లే పోయారు. గుండె ఆగిపోయివుండాలి.

జవాను:- అయ్యగారు. మా మంచి అయ్యగారు పొయ్యారా హాయ్యొయ్యో-పాపం మీరు ఒక్కరే కాబోలు వుండండి-

గుమాస్తాల్నీ వాళ్ళనూ పిలుచుకొస్తాను వారొచ్చిముందు జరగవలసినపని చూస్తారు.

లలిత:- ఏమో బాబు - ఇక నాజీవిత మెట్లానో - నాకింత చిన్న వయస్సులోనే- వాకీ దురదృష్టం చూస్తుండగానే వార్ని, మావార్ని, మృత్యుదేవత ఎత్తుకుపోయింది. వారితో నా సుఖమేం తీరిందని - ఒక బిడ్డన్నా పుట్టకముందే-

జవాను:- ఏడవకండమ్మా- ఏడ్చి లాభంలేదు. ఇది ప్రపంచం, పుడుతుంటారు పోతుంటారు. ఏడవకమ్మా ఏడవకు ఇప్పుడే వస్తాను. (వాడు గుడ్డతో కళ్లు తుడుచుకుంటూ పోతాడు.)

లలిత:- (తలంతా విరబోసుకొని—ఇల్లు అదిరిపోయేటట్లు ఏడుస్తూ వుంటుంది.)

[తెర]

-∞-

# పదియవరంగము

[నిత్యబాబు - పిచ్చెక్కిన వాడిలా అటూ ఇటూ తిరుగుతుంటాడు కాసేపు తలను చేతో పట్టుకొని విపరీతమైన మనోవ్యథతో తల చిందరవందరగా చేస్తుంటూ] కన్న తల్లి దండ్రులతో హోరాహోరీ పోట్లాడి ఇల్లొదిలిపెట్టాను పార్టీ కోసం. పార్టీకన్నా గొప్ప దేదీ ప్రపంచంలో లేదనుకున్నాను. అహోరాత్రిలు నిస్వార్థంగా పనిచేసాను. చివరికి ఉమ్మేయించు కున్నాను దెబ్బలుకూడా తిన్నానుకదూ - వాళ్ళ నీచాల్ని బయటపెట్టానని అవును బయటపెట్టనూ మరి హిందూ సంఘంలో చాలా నీచాలు జరుగుతున్నాయని చాటు వ్యభి చారాలు, జరుగుతున్నాయని అంటే తప్పేం విన్నసార్లు ఈ కమ్యూనిస్టులు ప్లాట్‌ఫారాలమీద విమర్శించలేరు. ఎందుకు విమర్శించాలి. వీళ్ళుమాత్రం చేయడంలేదా చాటు వ్యభి చారాలు చాలా నీచాలు అట్లాంటప్పుడు వాటిని బయట పెట్టనా, కాంగ్రెస్ ప్రభుత్వంలో స్వేచ్ఛ లేదని విమర్శిస్తారే— ఈ కమ్యూనిస్టుపార్టీలో వుందా అంగుళం స్వేచ్ఛైనా-వీళ్ళ ప్రభుత్వం వున్న రష్యాలో వుందా. అట్లాంటప్పుడు వీళ్ళ నలుపు వీళ్లు చూసుకోకుండా ఇంకోళ్ళను విమర్శించడమెందుకు. నోరు మూసుకొని పడివుండాలి. కాని వుండటంలేదు వీళ్లు. అందుకే నేనూ నోరు మూసుకొని వుండదలచలేను. అందుకే నేనూ విమర్శించాను- నేనూ స్వేచ్ఛకోసం పోట్లాడాను. స్వేచ్ఛ కావాలన్నానని, వాళ్ళ మోసాల్ని బయటపెట్టానని ఒంటరివాణ్ణిచేసి నన్ను నానాహింసలూ పెడతారా! ఆహింసకు

రెండునెలలు మంచం పట్టానే—సరిగ్గా రెండునెల్లా రెండురోజులు (పైకి కళ్లెత్తి చూస్తాడు. ఏదో జ్ఞాపకమొస్తుంది. కళ్ళవెంట నీరు కారుస్తాడు కళ్ళు తుడుచుకుంటూ.) సత్యవాణి కనపడక సరిగ్గా రెండు నెల్లా రెండురోజులు. ఒక్క క్షణం అది కనపడకపోతే పిచ్చెత్తిపోయేది నాదాన్ని నా నుంచి వేరుచేస్తారా.

మార్తాండుడు — ఇంత ఘోరంచేసినవాళ్ళను బ్రతక నివ్వను. దేశసేవ పేరుతో దేశాన్ని నాశనంచేసే దుర్మార్గులు వుండటానికి వీల్లేదు. ఇదొక ఫ్యాక్టరీగా తయారైంది. ఈ ఫ్యాక్టరీలో మానవులు, కూలీలుగా, బానిసలుగా, యంత్రాలుగా తయారౌతున్నారు. [బల్లోనుంచి అమాంతం కత్తి పైకి లాగి కత్తిని కళ్ళకెదురుగా పెట్టుకుని] ఈ కత్తితో చిత్రవధ చేస్తాను, ఒక్కొక్కణ్ణి నిలబెట్టి గొంతులోకి దింపుతాను కత్తి. ఈ నీచులింకా ఈ భూమిమీదవుంటే దేశం నాశనమైపోతుంది. నరనరన నరికేస్తాను. వాళ్ళరక్తం సీసాలకు పట్టించి, ప్రతిరోజూ సంతోషంగా తాగుతాను. వాళ్ళపుర్రెలు పట్టుకొని పైశాచిక నృత్యంచేస్తాను. [కత్తిని ఎగరేసి పట్టుకొని] నువ్వే, కత్తీ, నీ కిన్నాళ్ళకు పని కల్పిస్తున్నానుకదూ—ఇంతవరకూ నీ జీవితం, నాదగ్గర వృథాగా నడిచిందికదూ—ఇకమీదను నీజీవితం—మహో త్సాహంగా నడుస్తుంది. కమ్యూనిస్టులరక్తంతో నిన్ను స్నానం చేయిస్తాను. ఆ స్నానంలో నువ్వు తళతళ మెరుస్తావు నీకొక పర్వదిన [illegible] పని చేతికందినవాడినల్లా నరుకు — దొంగలు — నీచులు — కపటులు — వేషాలు వేసేవాళ్ళు వుండటానికి వీల్లేదు. ఈ భూమిమీద జీవించడానికి

అర్హత లేదు. పద (ఒక్కసారి ఎగిరి గంతేసి ముందుకు దూకు తాడు. ఇంతలోనే తెరవెనుకనుంచి ఒక కంఠ స్వరం నిత్య బాబును సంభోదిస్తూ—)

కంఠం:- నిత్యబాబూ, ఆగు, తొందరపడి ముందుకు దూక బోకు, వెనక్కురా.

నిత్య:-(సగం వెనక్కు తిరిగి ఆధ్వని వైపు చూస్తూవుంటాడు.)

కంఠస్వరం:- వాళ్ళు తుచ్ఛులేకాని, వాళ్ళు చస్తే, వాళ్ళ తల్లులూ, పెళ్ళాలూ గొల్లున ఏడుస్తారు. జీవితాంతం కుమిలిపోతాయి, కొన్నికుటుంబాలే. అదేకాదు నీకింకో గుణముంది. అదినీకు బాగా తెలుసుకూడా. మామూ లుగా వుద్రేకంలో నీవు ఎవరినన్నా మాటలన్నా లేక ఒక దెబ్బకొట్టినా తరువాత విపరీతంగా బాధపడు తుం టావు. ఎందుకు కొట్టానా, ఎందుకు అన్నానా అని నీమనసంతా బాధపడుతుంది. ఇక అట్లాంటివి. మను షుల్ని ఖూనీలుచేసి ఒక్క క్షణం సుఖంగా నిద్ర పోగలవూ? పోలేవు, మానసికంగా యమయాతన పడతావు. ఇంత మందిని నా పొట్టన పెట్టుకున్నానే అని. అది నీ ఆత్మ భరించలేదు. కాబట్టి విరమించు-చంపకు వదిలెయి. నీకత్తిని తుచ్ఛులరక్తంలోతడిపి అపవిత్రం చేయకు-ఇక సత్యావాణి సంగతంటావా-నీదంతా పిచ్చిగాని- సత్యావాణికే, నీవు కావాలనుకుంటే రెండు నెలలైనా కనపడకుండా వుం టుందా పార్టీ నిర్బంధించినంత మాత్రాన పార్టీకి జడిసి మృగాలతో నిండిన పార్టీలో కలిసి పోతుందా అదికూడా

ఒక పాషాణమే-సత్యవాణి మీద బ్రమకూడా ఒదిలెయి. సత్యవాణిమీదే కాదు-ఈ ప్రపంచం మీదే ఒదిలిపెట్టుకో ఇదిగో-ఇటుమూరకు-ఈ పూవన పరిసంచగుంతా. ఆడగాని మొగగాని, అంతా దొంగలే-మానవపురుగులతో అందులో మరీ ఈ కమ్యూనిస్టు పురుగులకీ విసుగెత్తి పోయింది నీ ప్రాణం-విసుగెత్తిన నీ ప్రాణానికి శాంతి పరిపాదించు. పో. అదుగో కనపడటం లా-తోట ఆతోటలో ఒక పాడు పడిన ఇల్లువుంది పోయి, అక్కడచేరు. ఆతోట, చాలా చల్లగావుంటుంది. పో. ఆలశ్యం చేయకు-(ధ్వని అగుతుంది.)

నిత్య:-పోతున్నా కత్తిదూరంగా విసిరేస్తాడు) ఇకమానవులతో సంపర్కం నాకొద్దు-అప్సరసయినాసరే, అరవిందమహర్షి అయినాసరే-నాకెవరూ అక్కర్లేదు నేనేస్త్రీనై నేనేపురుషుణ్ణై నేనే అన్నిఅయి, నాలోనే అనుభవిస్తా అనందం. పోతున్నా ఆ తోటకే- శిథిలమైన నాకు, ఆ శిథిలభవనమే తోడుగా వుంటుంది. అక్కడే నివాస మేర్పరచుకుంటూ. (నెళతాడు దగ్గలోనే వున్న తోటలోకి. ఆ శిథిలభవనపు అరుగులపై కూర్చుంటాడు. చెట్లనీడ అరుగులపై పడుతుంటుంది. (తెర వెనుకనుంచి నిత్యబాబును ప్రశ్నిస్తూ ఒక పాట వినబడు తుంది.)

పాట.

శాంతి-శాంతి-శాంతి-ఈలోకాని
శాంతి-సుఖం-స్వేచ్ఛా వచ్చే దెన్నడురా.
మన కొచ్చే దెక్కడరా.

నిత్య:- (కొంచెంతలతిప్పి), ఆప్రశ్నకు సమాధానంగా, పాటలు పద్యాలు వరసన చదువుతాడు)

పాట.

1. శాంతీ, సుఖమూ, స్వేచ్ఛా, వచ్చేనాడేరా
కట్టెలలో నీ శవం - కాలేస్మశానంలో రా-
బతికుండగా రాదురా- ॥శాంతి॥
ఏవాద జగత్తులో నైనాసరే-
బతికుండే రాదురా ॥శాంతి॥
ప్రళయమొచ్చి-ప్రపంచమంతా-జల
మయమై పోతే-వస్తుందిరా- ॥శాంతి॥
ఈమానవులంతా-మంటల్లో-భగ్గున మండి
మసైతే-వస్తుందిరా - ॥శాంతి.

వచనం:- శాంతి-సుఖం-స్వేచ్ఛ- వెధవ ప్రశ్నలు, వెధవబ్రిమలు ఈ స్వేచ్ఛా,, అని అడిగే వాళ్ళు వాళ్ళకిరింది వాళ్ళ కిస్తున్నారా స్వేచ్ఛ.

పద్యం.

2. మానవునకుగాని - జంతువునకుగాని
ఈ భూమిపై చరించు - ఏ ప్రాణికైననుగాని
స్వేచ్ఛా, సుఖమూ, శాంతి, కలదనుట
ఇంతకు ముందైనను - వుండనుట
ఇకముందైనను వచ్చుననుమాట అబద్దము
ఇది ముమ్మాటికి నిజమ్మురా.

3. వేలయుగాలనుంచీ - భూమిపై
మానవు లుదయించిన నాటినుంచి
ఉద్భవించుచున్న వెన్నో - మతముల్
సంఘముల్ - వేల సంఖ్యలో
ఎప్పటికప్పుడవి - కన్పట్టు నూతనాలుగానే
పాతవి - రోతనిపించుగాని
ఈ క్రొత్తవిమాత్రము - కొన్నినాళ్ళకు
కాకపోవునా - పాతవై
రోతనిపింపకుండునా

4. కండ్లకు కన్పించు - తిరుగని
సూర్యుడు తిరుగుచున్నట్లుగాని-
వాస్తవమున - కదలడా సూర్యుడు
మన కండ్ల కదలికే గాని.

5. ఇదేరీతి - తిరుగని సూర్యునితిరుగుచున్నట్లుభావించురీతి
సంఘము మార్చితిమని - ఏదో సంస్కరించితిమని
కాలము మారిపోయినదని - భ్రమింతురుగాని
వాస్తవమున మారలేదీ సంఘము-లోకమూ, కాలమూ
మారబోదిక - ముందైన వేలయుగాలకైనా,
వేల మతముల్ వుద్భవించినా-
సంఘముల్ జనించినా
జననాయకు లుదయించి చచ్చినా

[గోడకు చేరగిలపడతాడు]

[కొద్దికాలం తరువాత ఒక పెద్దగుంపు అరపులతో కర్రలతో ప్రవేశం]

గుంపు:- నిత్యబాబుగారూ - నిత్యబాబుగారూ రాండి, పోదాం మిమ్మల్ని హింసపెట్టిన మీ శత్రువులైన కమ్యూనిష్టుల్ని నరుకుదాం రాండి.

నిత్య:- (కళ్ళు నులుపుకుంటూ) నరకడమేంటి? అసలెవరు మీరు?

గుంపు:- మేము - మనుష్యుల్నే మరిచిపోయ్యారా.

నిత్య:- మానవులందర్ని మరచిపోయాను.

అనేక కంఠాలు:- అట్లా మరచిపోరాదు. ఏవరో కొందరి, తుచ్ఛులమూలాన, మానవులందరిమీద విరక్తిచెందితే ఎట్లా (అందరూ పోటీలుపడుతూ గోలగా అరుస్తుంటారు.) మేం కాంగ్రెస్, మేం. సోసలిస్టులం-మాది హిందూ మహా సభ-ఆర్, యస్ యస్. మాది ఏసుక్రీస్తుమతం.

నిత్య:- అబ్బ, చాలు. మీరా, ఆగండి. అందరూకలిసి గోలగా అరవకండి. ఇన్ని పార్టీలవాళ్ళూ ఒక్కసారే మాట్లాడితే నాకు పిచ్చెత్తిపోతుంది, ఎవరో ఇద్దరు అందరి తరఫునా అసలు సంగతేమిటో మాట్లాడండి.

ఒక దేశభక్తుడు:- అట్లాగే-మాలో మీయిష్టమొచ్చిన పార్టీ నివరించండి. మీరు నిప్పులాంటి దేశభక్తులు' మాలోచేరి దేశసేవ చేయండి.

నిత్య:- దేశసేవ-(చిన్ని మందహాసంచేసి) దాని రుచిచూసాను. దేశసేవ- చాలా ఘోరంగా పరిణమించింది. దేశసేవ, త్యాగం అనేమాటలు, నాకిప్పుడు చాలా అసహ్యంగా కనపడుతున్నాయి దేశసేవ పేరుతో చాలా అన్యాయాలు జరుగు తున్నాయి. నా కక్కర్లేదు.

దేశభక్తు:- మాపార్టీలో అంట్లాంటి అన్యాయాలేమీ లేవు

చాలా కంఠాలు:- మా పార్టీ చాలామంచిది - ఇతర పార్టీల కన్నా, మా పార్టీ మంచిది - మా పార్టీలో చేరండి.

నిత్య:- (చెవులు మూసుకుంటూ) అదిగో మళ్ళి గోలచేస్తున్నారు. భరించలేను. ఆగండి. మంచిదని ఎట్లానమ్మకం. కమ్యూనిస్టులకున్నట్లే మీకూ ముక్కులున్నాయి, చెవులున్నాయి. కళ్ళున్నాయి. తలకాయలున్నాయి. మీలో మాత్రం మార్పేముంది నమ్మడానికి-ఒద్దు వెళ్ళండి నాకు మానవులమీదే విశ్వాసం పోయింది. దేశసేవపేరుతో నన్ను మళ్ళి రొచ్చులోకి దింపకండి. స్వేచ్ఛగా నన్ను గాలిపీల్చుకోనివ్వండి. (బతిమాలుకుంటూ-పొండి. ఇదంతా ఒక నాటకం-నేనూ-మీరు మార్పేదేమీలేదు ఈలో కాన్ని-ఎందరో అయిపోయారుఈ లోకాన్ని మారుద్దామని యెంచి, తుదకు మార్చలేక కాలప్రవాహంలో కలిసి పొయ్యారు.

ఒక మతభక్తుడు:- (వెంటనే అందుకుని) నిజం చెప్పారు. నిత్యబాబుగారూ, మీమాట ఒప్పుకుంటాను. మా మతం కూడా ఒప్పుకుంటుంది. కాని మావి ఈ కొత్త సంఘాల

లాగు మొన్న పుట్టినవి కావు చాలా పురాతనమైనవి–రాండి మామతంలో చేరండి.

మతస్థులందరూ పోటీ పడుతూ:- రాండి మామతం మంచిది మామతంలో చేరండి.

నిత్య:- చేరడాలసంగతి, తరువాతగాని మళ్లీఅంటున్నారుఅరవ కండి. మతాలు మీవి పాతవేకావచ్చు. కానీ అవికూడా ముక్కూ, చెవులూ, కళ్ళూ, తలకాయలూవున్న మానవ మాత్రులేకదూ నిర్మించింది, కాబట్టి నమ్మకంలేదు. విశ్వా సంలేదు. మీరుకూడా వెళ్ళవచ్చు.

దేశభక్తుడు- నిత్యబాబుగారూ, ఒకప్పుడు దేశంకోసం పాటు పడ్డారు.

నిత్య:- అవును ఇప్పుడు పిసుగెత్తి విరమించుకున్నాను.

దేశభ:- మీసంగతి వారే చూసుకుంటే–

నిత్య:- అవును. ఈ ప్రపంచమే బాగుపడుతుంది. ఎవరిసంగతి వాళ్ళు చూసుకుంటూ ఇంకొళ్ళసంగతిలోజోక్యం కలిగించు కోకుండావుంటే దివ్యంగా సాగిపోతుంది ప్రపంచం. పరుల కుపకారం చేయనక్కర్లేదు. అపకారంచేయకుండావుంటే చాలు మహోపకారంచేసినంతఫలం. ఎవరిసేవ వాళ్ళు చేసుకుంటే చాలు, దేశసేవచేసినంతఫలం. ప్రపంచానికి దూరంగావుంటేచాలు- ప్రపంచాన్ని వుద్ధరించినంతఫలం.

మతభక్తుడు:- కాని అది అసాధ్యం-ఆలాజరగడానికి పరిస్థితులు అనుకూలించవుకూడా. మామతంలో అర్జునుడికి క్రిష్ణుడు

చెప్పాడు యుద్ధరంగంలో — ఈ మానవమధ్యంలో వున్న నీవు దుష్టసంహారం చెయ్యాల్సిందే. దుష్టులమధ్యనవుండి సంహారంచేయకపోతే నువ్వే సంహారమైపోతావు. అయినా నువ్వెవరవు. నేనెవరు ? కాబట్టి ఆచరించు అని అర్జునుని రంగంలోకి దింపాడు. దాంతో భయంకరయుద్ధంచేసాడు. అర్జునుడు రక్తప్రవాహంలో ఈదాడు ధర్మంకోసం.

నిత్య:- రక్తాలూ, ప్రవాహాలు ప్రస్తుతం వద్దు నాకు. దుష్టుల మధ్యనవుంటే నిజంగానే సంహారంచెయ్యాలి. చేస్తాను. కారణం మన [illegible] వాళ్ళల్లోకాడు కనుక. కనుక దుష్టులమధ్యే వుండలేను. మానవులమీద మళ్ళ విశ్వాసం కలిగేంతవరకూ కనపడకుండా పోతాను, మానవమాత్రులు కనపడని ప్రదేశముకోపోతాను. నన్ను వెళ్ళనీ నుండి అపనింకోసంగతి చెప్పనా మీకు-నేను మీకు క్రొత్త కాబట్టి, ఇన్నాళ్ళా దూరంగావుండి చూస్తున్నారు కనుక నేనంటే మీరంతా మోజుపడుతున్నారు, ప్రేమిస్తు న్నారు. ఆప్రేమలోనే మీలో చేరకుంటున్నారు, కాని చేరితే, నేనూ కొన్నాళ్ళల్లో పాతపడిపోతాను మీకు. మీ కష్టాలు రోజు పుడుతుంది. అసహ్యంకూడా పుడుతుంది, అదిమామూలుగా కూడాకాదు. నేనువచ్చి పోతే బాధ విరగడైపోతుందన్నంతగా-దాంతో నాకూ మీమీద అంతేపుడుతుంది. అది మీ తప్పు వల్లకాదు, నా మెదడు, నా ఆలోచనలు, నాపనులు, నాపరిస్థితి మానవ నేత్రా లకు చాలా అన్యాయాలుగా కనపడుతాయి. అందుకని

నేను దూరంగానేవుంటా. అదేకాక బ్రతికున్నవాడు పాత పడితే (మళ్ళీ చచ్చినవాడైతే పాతపడ్డ కొద్ది మోజెక్కు-వాతుంది. విలువకూడా) రోతపుట్టడం తప్పదని నాసిద్ధాంతం. అందుకని మోజులు చెడకుండా వుండాలంటే, ప్రేమలు శాశ్వితం కావాలంటే, ఒకరికొకరు దూరంగా వుండటమే మంచిది. నన్ను నాదారిన పోనీయండి, ఒకరి దారికొకరు అడ్డురాకుండా ఎవరిదారి వాళ్ళు పోతూంటే మనమంతా ఆనందంగా బ్రతికే అవకాశాలున్నాయి.

అన్ని కంఠాలు ఒకే సారి - మీదారికి మే మడ్డురాం. పరుల దార్లకడ్డురాపడానికి మేం కమ్యూనిస్టులంకాదు, స్వేచ్ఛగా ఆనందంగా మీ యిష్ట మొచ్చిన ప్రదేశంలోకి పొండి. మాదారిన మేం పోతాం.

నిత్యబాబు:- మీరింత సహృదయులైనందుకు పరులస్వేచ్ఛకు మన సారా సంతోష పడగలుగుతున్నందుకు, మీ అందరికీనా హృదయ పూర్వక వందనాలు. వెళ్ళొస్తాను.

అంతా ఒకే సారి:- వెళ్ళిరండి.

[నిత్యబాబు అరుగుదిగి వెళ్ళిపోతుంటాడు-తక్కిన మానవ సమూహం ఇంకోదారి వెంటవెళ్ళి పోతూ వుంటుంది]

[తెర]



—oo:o:oo—



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA107B103 |
| పుస్తకం పేరు | కెమిస్ట్రీ ప్రాక్టికల్ గైడ్ |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 89 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ch. Ramya |
| పేజీలు విడదీసినది | Ch. Ramya |
| స్కాన్ చేసినది | K DAVCRD |
| పరీక్ష చేసినది | Ch. Ramya |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |